# స్వామిలేఖలు - శాంతిరేఖలు



కర్త

డా॥ మోపిదేవి కృష్ణస్వామి
ఎం. ఏ. పిహెచ్.డి.

కూర్పు

యమ్. ఉమాదేవి
ఎమ్. ఏ

ది యూనివర్సల్
హ్యూమానిటేరియన్ ఎడ్యుకేషన్ ట్రస్టు
ప్రచురణ

# ముందుమాట

అన్వేషణ అనుభూతిలో కృష్ణస్వామిగారిని చేరదీసారు మాస్టర్ ఇ కె. అలాంటిఅన్వేషణలో నేఅంపిసొంలసిపోతున్ననన్ను నేదదీర్చి నాకు మాస్టరుగారయ్యారు. శ్రీకృష్ణస్వామి.

ఆయనతో వీలయినంత ఎక్కువ కాలం గడపాలని మనస్సు కోరుకొనేది. ఆయన కార్యక్రమంలో పాల్గొనడం ద్వారా మాత్రమే అదిసాధ్యమని నాకు గ్రహింపుకు వచ్చింది. మెల్లిగా వారిరచనా వ్యాసంగంలో పాల్గొంటూవారు చెబుతుంటే వ్రాసిపెట్టసాగాను. వారి సాహితీ ప్రవంతి నా మీదుగా లోకానికి చేరువకావడం నా అదృష్టం. నాకు ఆనందం.

ఒక ప్రక్క గ్రంధరచన సాగుతూవుండగా మధ్యలో ఆత్మీయులైన వారికి ఆర్తిలోనున్న వారికి తమనుండి శిక్షణ పొందుతున్న వారికి లేఖలను డిక్టేట్ చేస్తూ ఉంటారు ఆయన నాకు ఒక ఆలోచన వచ్చింది "ఈ లేఖలు చాలా విలువైనవి. ఇవి ఎవరికి వ్రాయబడుతున్నా అందరికి అక్కరకు వచ్చే రూపాన్ని పొందుతున్నాయి నామటుకు నాకు ఎన్నో సమాధానాలు పరిష్కారాలు ఈ లేఖలనుండి లభిస్తున్నాయి. అలాగే అందరికి వీటినుండి జీవితానికి కావలసిన సమన్వయం అందుతుందనిపించింది అలాంటప్పుడు వీటినే ఒక పుస్తకంగాకూర్పు చేస్తే నాలాంటివాళ్ళకు అందరికీ అక్కరకు వస్తాయని అనిపించింది మాస్టరుగారి అనుమతితో ఈ నా ఆలోచన ఆచరణ రూపందాల్చింది.

ఈలేఖలు సందేశపరంగాఎంతటివిలువైనవో. సాహిత్యపరంగాను అంతటి విలువైనవే. సాహిత్యంద్వారా సందేశాన్ని

అందించదలచిన సందేశమే సాహిత్య స్వరూపాన్ని స్వీకరించిం దికదా మహాకవులు వాల్మీకివ్యాసులనుండికూడా ఇలాగే రూపు కట్టు కుందేమో

విభిన్న వయస్సుల్లో ఉన్నవారు విభిన్న మనస్తత్వాల కలవారు ఈ లేఖలో మాస్టరుగారిచేత పరామర్శించబడ్డారు. మాస్టరుగారినుండి పరిష్కారాలను అందుకున్నారు అందుకున్న వారు నేటి మన సమాజానికి ప్రతినిధులు అని మనం భావించ గలిగితే ఈ లేఖలు నేటి మనసమాజానికి మాస్టరుగారందిస్తున్న దివ్య సందేశమే.

మాస్టరుగారినుండి వ్యక్తమవుతున్న మన జాతి పున ర్నిర్మాణ" కార్యక్రమానికి ఈసంకలనంకూడా ఒక సాధనంగా వినియోగపడగలదని విశ్వసిస్తూ గ్రంధాన్ని మీ చేతుల కంది స్తున్నాను

ఈ సంకలనాన్ని సరస హృదయులై పరిచయంచేసిన శ్రీ పులిగడ్డ వసంతకుమార్‌గారికి నా ధన్యవాదాలు ఎప్పటికో వస్తుందనుకున్న ఈ పుస్తకాన్ని ఇప్పుడే అచ్చులో అందిస్తూ అందరిని ఆశ్చర్య ఆనందాలలో ముంచుతున్న "వికాస్ ప్రింట్" సోదర బృందంవారికి నా అభినందనలు. ముఖచిత్రాన్ని కల్పన చేసి గ్రంధ స్వరూపాన్ని ఆముఖచిత్రంలోనే ప్రదర్శించగలి గిన సోదరుడు దాసుకు నా శుభాకాంక్షలు. ఉత్సాహంతో చదవ డానికి ఉన్ముఖులవుతున్న మీకు ఈ సంకలనం మీకు కావల్సిన సంతృప్తి నీయగలదని విశ్వసిస్తూ

విశాఖపట్టణం
8-8-1985

మీ
ఉషాదేవి

# నేను ఎవరినీ పొగడను

వేదాలకు గ్రంధాలు అనే లౌకిక అర్థం ఆపాదించుకుంటే అవి కూడా పుస్తకాల లెక్కలోకే జమ. కాని అవి సాహిత్య పరిషత్తులు ప్రదానం చేసే బిరుదాలకోసంగాని, వ్యాపార సంస్థలు యిచ్చే దక్షిణల కోసంగాని వ్రాయబడ్డవికావు. సాహిత్య చరిత్రలో యుగకర్తలమని అని పించుకోవడానికిగాని, సమాజాన్ని మరామత్తుచేసి బ్రహ్మాండమయిన మార్పు తీసుకువద్దామనిగాని, పేరుపెట్టుకొని రచించినవి గావు.

ఈ విశ్వరూపం వెనుక ఉన్న నిజ ధర్మం, దానికి ఒదిగివున్న ప్రకృతి. పురుషుడు వీటి ప్రవృత్తులలోని అంతరార్థం, ఈ రెండింటి మనుగడకు మూలమయిన అసలు అర్థం — వీటినితమ మనోనేత్రంతో దర్శించి ఆకళింపుచేసుకుని, ఆపైన కలిగిన ఆలోచనానుభూతులను అప్పుడప్పుడు తమ చుట్టూవున్న వారికి, తమకు తట్టిన మాటల రూపంలో అందించారు పరమగురువులు కొందరు. వారినుంచి శబ్దరూపం వింటున్న వారి ఆలోచనలను, కావాలి అనుకొన్న కొందరు కంఠస్థంచేసికొన్నారు. కాలానుగుణంగా అవే గ్రంథస్థాలూ అయినాయి.

తను కావాలనుకున్న వారికే — తనను తనాను కావాలనుకొన్న వారికీ అప్పుడప్పుడుతనతో కలిగినఅనుభూతులను కృష్ణస్వామి విప్పిచెప్పగా సంపుటీకరించి అపూర్వంగా ఇప్పుడు మనకు అందించారు శ్రీమతి ఉమాదేవి.

"హంస", అనే శ్వాసలోంచి పుట్టిన కంఠధ్వని, అకారాదిక్షకారాంత వర్ణాలతో సహవాసం చేసి పదాలు, వాక్యాలతో స్నేహం చేసే లౌకికలౌకిక మయిన అభిప్రాయాలు వాటికి సంగదోషం ఆపాదిస్తాయి. ఈ దుస్సంగత్యపు తెరను తొలగించి, ఆ వెనుకచూస్తే కనుపించేది తొణికిసలాడే శుద్ధ చైతన్యం" ఇది నా మాటలుకాను. గురుపాదుల కృష్ణ శబ్దాలు.

"దివ్య గ్రంథాలను మనం అర్థంచేసికొనడం వుండదు. మనకు అవి అర్థంకావడం వుంటుంది" ఇవీ నా మాటలు కావు. స్వామిరూపమయిన కృష్ణ శబ్దాలే.

వేద శబ్దాల వెనుక దాగిన శుద్ధ సత్యానికిఎంతోమంది ఎన్నోరకాల భాష్యాలు చెప్పారు. వారి వారి బుద్ధి తాహతునుబట్టి తిరిగి వారి వారి బుద్ధి, తాహతునుబట్టి అర్థం చెప్పుకొన్నారుఅవి చదివినవారు.

ప్రపంచ సాహిత్యంలో లేఖా సాహిత్యం తగుమాత్రంగా వుందనే

షంది. కాని దాని విలువ, ప్రయోజనమూ, సాహిత్య సమీక్షలకూ, గ్రంథాలయాల సంఖ్యకూ మాత్రమే పరిమితం.

కాని స్వామిలేఖలు కేవలం సమీక్షలకూ, గ్రంథాలయాలకూ ఉద్దేశింపబడి వ్రాసినవి గావు.

వ్రాసినది ఎవరికో అనవసరమూ, అప్రస్తుతమూనూ, కాని చదువుతున్న ప్రతి ఒక్కరూ, ఈ రోజే. నన్నుద్దేశించి వ్రాసినవే అనుకోక తప్పదు.

ఒక ప్రత్యేక విషయాన్ని దృష్టిలో పెట్టుకుని, వ్యాసాన్ని పరిధిని నిర్ణయించుకుని వ్రాసిన ప్రత్యుత్తరాలు, కొంతకాలానికి ఉత్తరాలుగానే మిగిలిపోవడం తథ్యం కాని మనిషి బ్రతుక్కూ, మానవతా విలువలకూ, ముడిపెట్టి, వ్యక్తిగత విషయాలను విశ్వమానవ శ్రేయస్సువైపుగా అనుసంధించాలనే తపనతో నిండిన స్వామిలేఖలు సర్వకాలీనంగా వెలిగేకాంతిరేఖలు.

(అందుకే రచనాశిల్పాల విన్యాసాలు, సాహిత్య సూత్రాల బంధనలూ మనన బాధించవు మన పెద్దన్నయ్య మన ప్రక్కనకూర్చుని కబుర్లు చెపుతున్న అనుభూతి కలుగుతుంది.)

"అన్నయ్యా ఈ పాఠానికి అర్థం చెప్పవూ : ఈ లెక్క విప్పి చెప్పరూ : అని అడిగే బడిపిల్లల మొదలు.

"మేం ఫలానా పని పూర్తిచేశాం : ఎంత సాధించామో చూడు" అని మీసం తిప్పేవారి వరకూ

ఎవరికి చెప్పేధోరణిలో వారికి చెప్పినవి ఈ లేఖలు.

"క్రమశిక్షణ అంటె టెన్షన్‌తో పనిచేయడం కాదు. మనంచేసే పనిమీద అటెన్షన్ ఉంచడం అన్నమాట" అని ఒకచోట

"అమ్మదగ్గర పాలుత్రాగే చంటివాడు ఆ అధికారం తనకే ఉంది అన్నట్లు పోట్లాడుతాడు అన్నల దగ్గిర. కాని పైవాళ్ళందరూ త్రాగిన చోటునుండీ తానూ త్రాగుతున్నానన్న సత్యం విదానంమీదగాని తెలుసుకోలేడు" అని మరొకచోట మనలో కొందరు పసిపిల్లలకు చదువుచెబుతాడు

రోగులు ప్రవాహమువలె నడచి వచ్చేతీరవి తెలిసినది బాగున్నది కాని, రోగులకు న్యాయము చేకూర్చుటకు క్రమశిక్షణాయుతమైన కార్యక్రమమును మీరు చేపట్టవలెను" అని హెచ్చరిస్తాడు ఒకచిన్న తమ్ముడిని

తనకు తోచినట్లు మాత్రమే నడవాలనుకునేవాడు, తన వారిని నడి పించాలనుకునే వాడు ఎంత పద్ధతివున్నాని మంత అవుతాడు" అంటూ మందలిస్తాడు మరో మీసాల తమ్ముడిని.

"సామాన్య స్త్రీ తన జీవిత నిర్వహణమే ఒక సాధన.... వేదన లను ఓర్పుతో సహించి, కష్టాలతోనే కాపురం చేస్తున్న స్త్రీమూర్తికి ఏ వేదాధ్యయనపరుడూ సాటిరాడు" అని నచ్చచెపుతాడు ఒక సోదరికి.

"భగవంతుని అనుగ్రహం మనపైన వుండగా, ఏ గ్రహమూ మనని ఏమీ చేయలేదు "అంటూనే" కర్తవ్యాన్ని విడిచివెట్టి దేవుడి ఫోటోముందు కన్నులుమూసికొన్నవాడు కర్తవ్యం యెడల కన్నుమూసు కున్నవాడు అవుతున్నాడు" అంటూ మందలిస్తాడు. ఒక బాదస్త్రాన్ని.

ఇలా అందరికీ అన్ని చెపుతూనే, నిత్యసత్యాలయిన విషయా లను అలవోకగా అందిస్తుంటాడు ఒక్కొక్కచోట మనకి అన్నీ తెలుసు అనుకునే మనలో కొందరు మహామహులుసైతం అహా అనేటట్లు ముందుకివస్తాడు కొన్ని చోట్ల.

"బుద్ధి, మనస్సు, చిత్తము, అహంకారము, ఇంద్రియములు, శరీరము వీటిని నడుపుకొనడంలో నైపుణ్యం సిద్ధించడమే బాగుండడం ఆ బాగుండడానికే పెద్దలు యోగం అని పేరుపెట్టారు ఆ యోగంక్షేమంగా వుండాలని వారు కోరుతూ వచ్చారు అందుకే ఇప్పటికీ మీ యోగక్షేమా లతో వుత్తరం వ్రాయండి" అని మనకు తెలియకుండానే (ఉత్తరాలలో) మనం వ్రాస్తూవుంటాము" అని మనకు తెలుసు అనుకొంటూ, నిజానికి అసలే తెలియని ఒక సంప్రదాయాన్ని వివరిస్తాడు.

కొందరు బ్రతుకుతెరువుకోసం గాంధీపేరును వాడుకొన్నట్లై, మరికొందరు తాము శ్రమజీవుల్లో నిలదొక్కుకోవడంకోసం మార్క్స్ పేరునువినియోగించుకుంటున్నారు." అంటూ "సమదృష్టి, చిత్తశుద్ధిలేనివారు ఏ యిజం పేరుచెప్పుకున్నా, ఏరంగుజండాపట్టుకున్నా ఎంత హంగూ హంగామా పెంచుకున్నా జరిగేది, ఒరిగేది ఏమీవుండదు" ఈమాటలు చదివి ఎవరి గుండెలు బాదుకున్నాగుడ్లెర్రజేసివిరుచుకుపడ్డా కాదు అని అనగలరో లేదోమనందరికీతెలుసు

అందుకే ఎందరికీ-ఎన్ని చెప్పినా - ఏరకంగా చెప్పినా, తన లక్ష్యం

ఏమిటో కుండ బద్దలు కొడతాడు ఒకచోట. "నాకు కావలసింది వ్యక్తి నీతిగా నిలబడటం, నిజాయితీగా బ్రతకగలగడం తనతోపిదే లోకమని తెలిసి సమదృష్టితో చిత్తశుద్ధితో జీవించటం ఈ ప్రబోధాన్ని అందించడానికి ఏ వేదికయినా ఒకటే నాకు" అంటాడు. అందుకనే ఏమైనా నావ ఒకటే అంటాను నేను, నవలయినా, వ్యాసమయినా, పద్యమైనా, వచన కవితయినా, అన్నీ రూపాలు ఈ లేఖల్లో కనుపిస్తాయి మనకు.

"అవసరానికి మించిన సంపదంతా కూడబెట్టుకోవడంవల్ల భీతి పెరుగుతుందే తప్ప ఒరిగేదేమీవుండదు" అంటూ" తన చుట్టూవున్న ప్రకృతిని గమనించుకుంటూ దానివలె నిష్కామంగా విధి నిర్వహణ చేయడంలో మానవుడు సిద్ధహస్తుడైనాడు సమస్యలనేవి వుండవు అన్న కృష్ణస్వామిలో బుద్ధుడు, మార్క్సు ఒక్కమారే కనుపిస్తారు

అందుకే తను చెప్పేది కేవలం సందేశమేగాని, ఆ సందేశం శాశ్వత సర్వకాలీనము అంటున్న కృష్ణస్వామి వ్రాసిన ఈ ఉత్తరాలు, ఉత్తరాలు కావు. సమాజంలో ముఖ్యంగా అస్తవ్యస్తంగా వున్న ఈనాటి యువ హృదయాలని వెన్నుతట్టి, నిద్రలేపి, కర్తవ్యాన్ని గుర్తుచేయాలనుకునే అతని తత్వహృదయం మనకు అర్థం అవుతుంది,

భారతీయులలో చాలమంది తెలుసుకుంటారు. కాని తలచుకోరు. జాతి తెలియక చెడిపోతూ వుందని అంటూవుంటారు. అది కొంతవరకే నిజం తెలిసినా తలచుకోవడానికి సిద్ధపడకపోవటంవల్లనే జాతి మనుగడ దెబ్బతింటోంది. అందుకే" తెలుసుకోవడం చాలదు. తలచుకోవడం కావాలి" అనిచెప్తూవున్న ఈ పుస్తకంలోని కృష్ణస్వామి మాటల్ని కేవలం మాత్ర "రాతగా" తలపేస్తే అతనన్న మాటను మనం నిజంగా నిజం చేసిన వారమవుతాం

నేనెవర్ని పొగడను అన్నాడు కృష్ణస్వామి ఒకచోట. మరి అతన్ని పొగడమని నేను మీతో మాత్రం ఎలా చెపుతాను.

కాకపోతే చెడును విస్మరించటం ఎంత అవసరమో మంచిని పెంచటం మనిషికి అంతకన్నా అవసరం కనుకనే అతను నిర్వహిస్తున్న మహాయజ్ఞంలో మనమూ మన విధి నిర్వర్తిద్దాం.

విజయవాడ, 10-8-86. వసంతకుమార్

ఇందులో.... పేజీ. నెం.

చి॥సౌ॥ ఉమాదేవికి శుభాశీస్సులు

నీవు మీ శ్రీవారి సాయంతో తీర్చిదిద్దిన లేఖల సంకలనం నాకెంతో తృప్తినిచ్చింది. కూర్పు చేయడంలో మీరెంతో తీర్పరులనికూడా స్పష్టమైంది. దీనినిబట్టి మిమ్మలనిద్దరిని ఒకటిగా కూర్చిన ఆ దైవం మరింత తీర్పరై యుండాలి. ఏమంటావు.

ఈ మీ ప్రయత్నం తప్పక ఫలిస్తుంది. ఈ సంకలనం చదువరులకు తన సాహచర్యాన్ని అందించడంద్వారావారిని కర్తవ్యోన్ముఖులుగా తప్పక తీర్చిదిద్దుకుంటుంది. అంతకన్న కావలసినదేమున్నది. ఈ మీ దంపతుల సాహితీ వ్యాసంగం చిరకాలం కొనసాగి ఇలాగే చిరంజీవమైన గ్రంథాలను లోకానికి అందిస్తూ ఉండాలి.

విజయవాడ
10-8-85

శుభాకాంక్షలతో
మోపిదేవి కృష్ణస్వామి

# సమర్పణము



మాస్టరుగారిచేత చేయించుకోవాలని కాక మాస్టరుగారికి ఏం చేసుకోగలమా? అని కంటికి రెప్పలా ఆయనను కనిపెట్టుకొని వెన్నంటి నడచిన ప్రియ సోదరుడు, ఆయన ఉద్యమం నలుదెసలా వ్యాపించాలని కలగంటూ అందుకు దారులు కనుగొంటూ ఆయనే జీవితంగా నడచిన సహచరుడు.

యశఃకాయుడు

**శ్రీ యన్. బి. కె. వి. ప్రసాద్‌కు**

హృదయపూర్వకంగా

—మోపిదేవి కృష్ణస్వామి

# స్వాప్నిలేఖలు - శాంతిరేఖలు

## అసంతృప్తి నుండి అసలుతృప్తికి.

చి॥ సౌ॥ .........లకు

ఆశీస్సులతో కృష్ణస్వామి వ్రాయునది. ఒక పనిలో పాల్గొంటున్న నలుగురూ ఒకే దీక్షతో పనిచేస్తారని మనం చెప్పలేం. వాళ్ళవాళ్ళ సంస్కారాలని బట్టి ఆ పనిపైన వాళ్ళు చూపే శ్రద్ధా, దీక్షా వ్యక్తమౌతూ ఉంటాయి. ఒకరు ఆ పనినే జీవితపరమావధిగా స్వీకరించవచ్చు. మరొకరు ఆ పనిని తమకు కొంత కాలక్షేపంగా భావించవచ్చు. ఈ పనిని ఇలానే చూడాలి అని మనం చెప్పినా, అందుకు సిద్ధంగా లేనివారికి ఆ మాటలు ఇబ్బందిగా ఉంటాయి. క్రమంగా మన పనిని మనం దీక్షగా చేస్తూ పోతూ ఉంటే రెండు విధాలైన పరిణామాలు జరగడానికి వీలవుతుంది.

1. మనతో పనిచేస్తున్న వాళ్ళు మన పనిచేత ప్రభా

వితమై క్రమంగా మేలోనని మనకు తగిన వారుగా రూపొం దడమైనా జరుగుతుంది.

2. లేదా మనకు తగిన వ్యక్తులు చిత్రంగా మన దగ్గ రకు ఆకర్షింపబడి మనపనిలో పాలుపంచు కోవడం, పనికి సిద్ధంగా లేని వ్యక్తులు చిత్రమైన కారణాలవల్ల ఏ ఘర్షణా లేకుండా తమకు తాముగా దూరంగా వెళ్ళి పోవడమైనా జరుగుతుంది.

ఈ రెండు విధానాలూ ప్రకృతి మన యెడల చక్కగా అమలు పర్చాలి అంటే మనం మన పనిని ప్రశాంతంగా పరమ గురువులకు సమర్పణగా చేసుకుంటూ ముందుకు సాగడమే కర్తవ్యం. ఇప్పుడు మీరు చేస్తున్నదదే. మీరు వెళుతున్న మార్గం సరియైనది. మీ మనస్సులు క్రమంగా సమంగా పని చేయగలవు. మీరు చేస్తున్న నిరంతర గురుస్మరణ కార్యక్రమా లకు చక్కని రూపుదిద్ద గలదు.

ప్రస్తుతం మనజాతిలో కొన్ని చిత్రమైన బలహీనతలు ఉన్నాయి. ఒళ్ళు వంచి పనిచేసేవాళ్ళు పిచ్చివాళ్ళనీ, ఒళ్ళు అలవకుండా పనిగడుపుకుపోయే వాళ్ళు తెలివైన వాళ్ళనీ, లోకసామాన్యమైన అభిప్రాయం. పనిచేసే వాళ్ళ సంఖ్య తక్కువ. పనిచేస్తున్నట్లు అభినయించే వాళ్ళ సంఖ్య ఎక్కువ. మన దేశంలో. ఈ ఎక్కువ మంది ఆ తక్కువ మందిని హేళ నగా చూస్తున్నారిప్పుడు. తమ చేతగానితనాన్ని నిష్ప్రయోజ కత్వాన్ని హేళనగా మార్చుకొంటూ ఆత్మ వంచన చేసు కుంటున్నారు.

క్రమంగా మార్పు వస్తోంది. పని చేసేవాళ్ళ సంఖ్య క్రమంగా పెరగడం ప్రారంభమయింది. మరో దశాబ్దం మనం శ్రమిస్తే వాతావరణం చాలా వరకు సర్దుకోవచ్చు. రాబోయే నవయుగానికి తెల్లవారు ఝాము వంటిది, ప్రస్తుతం మన మున్న కాలం. ఎందరో పడుకొని ఉండగా కొందరే ఆ అందరి పనికూడా చేస్తున్న కాలమిది. ఇప్పుడు పనిచేస్తున్న వారిని వైతాళికులు అంటారు. ఈ సన్నివేశాన్ని మనం రెండు విధాలుగా చూడవచ్చు.

1. అందరూ నిద్రపోతూ ఉండగా మనం మేల్కొన్నామే అని.

2. నిద్రపోతున్న అందరినీ మేల్కొల్పడానికే మనం మేల్కొని ఉన్నామని.

మొదటి విధంగా చూసిన వారికి అసంతృప్తి కలుగుతుంది. రెండవ విధంగా చూసిన వారికి అసలుతృప్తి దొరుకుతుంది. బాధ్యతలయెడల నిద్రపోతున్న వారిని బాధ్యతలఎడల కనువిప్పు కలిగిన వారు మేల్కొల్ప వలసిన సమయమిది.

......ఆశీస్సులతో......

# గతి తప్పని వాడికే ప్రగతి.

చి॥ సౌ॥ ......... కి

ఆశీస్సులు "ప్రేమ పెరగవలసింది పోయి నిర్లిప్తత పెరుగుతోంది" అని వ్రాసావు. నిర్లిప్తత అంటే నిర్లక్ష్యం కాదు సుమా! చేయవలసింది చేసి ఫలితాన్ని గురించి పట్టించు కోనకుండా ఉండ గలడమే నిర్లిప్తత. ఫలితాన్ని గురించి అఱులు చాచడమే తాపత్రయం. చేయవలసిందిచేస్తూ ఉండ డమే ప్రేమ. ఆ చేయడం చిరకాలం కొనసాగాలి అంటే ఉండకూడనిదే ఫలాపేక్ష. వ్యక్తులు మారినప్పుడు ఎందుకు చేయాలి అనడంలో వారు మారతారనే ఫలితాన్ని ఆశించినట్లు స్పష్టమవుతోంది గదా!

"బాగున్నావా అని అడిగితే "నవ్వొస్తోంది" ఈ మన స్సునా, శరీరాన్నా ఎవరిని అడుగుతున్నారని" అని వ్రాసావు. అన్నింటినీ అడుగుతున్నారు. అన్నింటితో నీవు బాగున్నావా అని అడుగుతున్నారు. బుద్ధి, మనస్సు, చిత్తము, అహం కారము, ఇంద్రియాలు, శరీరము వీటిని నడుపు కోవడంలో నైపుణ్యం సిద్ధించడమే బాగుండడము. వాటిని నడుపు కోవ డంలో బేలన్సు కుదరడమే బాగుండడము, ఆ బాగుండడానికే పెద్దలు యోగం అని పేరు పెట్టారు. ఆ యోగం క్షేమంగా ఉండాలని వారు కోరుతూ వచ్చారు. అందుకే ఇప్పటికీ "మీ యోగక్షేమాలతో ఉత్తరం వ్రాయండి అని మనకు తెలియ కుండానే మనం వ్రాస్తూ ఉంటాము. సంప్రదాయం విలువ అంతటిది. మనకు తెలియకుండానే మనవెంట బడి వస్తూ

ఉంటుందది. అది వస్తున్నట్లు గమనించి అర్థం చేసుకోవడం ద్వారా దానిని గౌరవించినవాడు ధన్యుడు.

మనస్సు కరిగిన స్థితిలో బాధఅనిపించదు. నిర్వికారంగా ఉంటోంది" అని వ్రాసావు. నిర్వికారం అంటే వికారం లేని స్థితి. వికారం అంటే మార్పు. శరీర కోశాలు గతి తప్ప కుండా యోగస్థితిలో నిలబడవపుడే నిర్వికారత అనుభవానికి వస్తుంది. గతి తప్పని వాడికే ప్రగతి. మిగిలిన అంశాలపై మళ్ళీ ఉత్తరం వ్రాస్తాను.

శుభాశీస్సులతో
సం..............

## తెడ్డు వదలకు

......కు ఆశీస్సులు.

నీవున్న పరిస్థితులు నాకు తెలియును. నీవు నీ అనుచరులతో కూడి, డిస్పెన్సరీ మొదలైన మంచి పనులు ఇదివరకటి వలె ప్రారంభించి నిరాటంకముగా నడిపినచో పరిస్థితుల ప్రభావము నీపై పడదు. పరిస్థితుల ప్రభావము మనపై పడకుండా, మన మనస్సు ఎల్లవేళలా ప్రశాంతముగా నుండవలెనన్నచో సత్కర్మాచరణ యొక్కటే సరియైన మార్గము. నది వేగముగా వచ్చుచున్నది గదా యని భయపడి, పడవ నడుపువాడు తెడ్డు ను వదిలి వేసినచో, పడవ ప్రయాణికులతో కూడా మునిగి పోవును. నదీ వేగము పెరుగుచున్న కొలది తెడ్డును కాళ్ళ

ముగా వినియోగించి ప్రయాణీకులను ఒడ్డునకు చేర్చుట పడవవాని కర్తవ్యము. అట్లే,పరిస్థితులు విజృంభించుచున్న వని సత్కార్యాచరణ కుంటు పరిచినచో నీవును, నీ అనుచరులును పరిస్థితుల ప్రాబల్యమును చర్చించు కొనుచు, లోకస్వభావమును నిందించుకొనుచు అశాంతిలో మునిగిపోవుటజరుగును. అట్లుకాక పరిస్థితుల ప్రాబల్యమును లెక్కచేయక,దానికి ఎదురు తిరగక, నీ అనుచరులతో పదిమందికి పనికివచ్చుసేవా కార్యక్రమములను పెంచుకొనుచూ పోయినచో, పరిస్థితులు క్రమముగా అను కూలముగా మారుట యేగాక తృప్తి, ప్రశాంతి, లభించును. గిట్టని వారున్నారని ఆలోచించుచూ సత్కార్యాచరణకు అశ్ర ద్ధచేసినచో మనమా ప్రాంతమును వదలి వెళ్ళవలసిన దుస్థితి సంభవించును. గిట్టని వారున్నను మనస్సులో వారి గిట్టమి తన మునకు ప్రాధాన్యమీయక, సత్కార్యాచరణను విజృంభింపచేసి నచో గిట్టని వారు తమ ప్రవర్తననైనను మార్చు కొందురు లేదా, చిత్రముగ మనకు దూరముగానైన వెళ్ళి పోవుదురు. ఎవరు ఎక్కడ ఉండవలెనో, ఎక్కడ ఉంచిన, వారు బాగుపడు దురో ప్రకృతికి బాగుగ తెలియును. ఇట్లుండ వలెనని మనము నిర్ణయించుటకంటె, పైవాని నిర్ణయమునకే దానినివదలి కర్త వ్యమును నిర్వహించుట ఒక్కటేమార్గము.

ఆశీస్సులతో

.............

## మెలకువతోపాటు అణకువ అవసరం

ప్రియసోదరుడు.........కు ఆశీస్సులు

నీవు వ్రాసిన ఉత్తరం అందింది. మీచే నిర్వహింపబడు తున్న కార్యక్రమము. మీ ఊరిలో జగద్గురు తత్త్వమును మరల సంస్థాపనము చేయగలదు. సన్నివేశములను సద్వినియోగ పరచుట భగవంతుడు మీ కనుగ్రహించిన ఒక ప్రత్యేకత.

సర్వయోగకథ లలితా సహస్రనామమునకు చెందిన చేపులో ఉండుట చిత్రము. బహుశా భారతం ఈ విధంగా ప్రవేశించినదేమో! ఈ సారిమీలో ఎవరైనా రాగలిగినచో పాత చేపులు ఇచ్చి, క్రొత్తవి పట్టుకెళ్ళవచ్చును. "జీసస్ బోధ" స్పష్టముగా ఉన్నది కదా?

సామాన్యంగా లోకంలో గురువుల దగ్గర, శిష్యులకు వినయవిధేయతలు క్రమశిక్షణ కనపడినంతగా, ప్రతిభ, ప్రజ్ఞా పాటవాలు గోచరించవు. మనమాస్టరుగారి దగ్గర అలాగాక, ఆయన అనుయాయులలో ప్రజ్ఞా పాటవాలు దినదిన ప్రవర్ధ మానంగా విచ్చుకోవడం కనిపిస్తుంది. అది ఆయన అనుగ్రహా నికి చిహ్నమేగాని మనగొప్పకు గుర్తుకాదు. ఆ ప్రజ్ఞాపాట వాలకు తగిన రీతిలో వినయవిధేయతలు అలవర్చుకోవలసిన బాధ్యత మనపైన ఉన్నది. క్రమశిక్షణ నేర్పవలసిన కర్తవ్యం మన కున్నది. ఆచరణ శీలమైన ఈ అంశాలను విస్మరిస్తే మన పలుకులు చిలకపలుకులే అవుతాయి. మెలకువతో బాటు అణ

కువ అవసరం. ఈ అణకువను అభ్యసించే ప్రయత్నంలో మన బృందం మాస్టరుగారి సంకల్పానికి అనుగుణంగా రూపొంద గలరని ఆశిస్తున్నాను. ప్రేమతో

.............

# గ్రహం-అనుగ్రహం

చి॥ సౌ॥ ......... కి ఆశీస్సులు

నీ ఆర్తి మాస్టరుగారు తప్పక వినిపించుకొంటారు. నీ విశ్వాసమే నీకు రక్షకాగలదు. "నా వెంట ఉండు వారికి ఎన్నడూ భద్రమే" అన్నది మాస్టరుగారి వాగ్దానము. కలవరాన్ని విడిచిపెట్టి కర్తవ్యాన్ని నిర్వహించాలి మనం. అమ్మగారి ఆరోగ్యం ఎలాగ ఉన్నది? సామాన్యంగా ఎవరిపైన పీడకలవస్తుందో వారికి రక్షణ కలుగుతుందని మన పెద్దలు అనుభవంతో చెప్పేమాట. ఆ లెక్కన మీ అమ్మగారి ఆరోగ్యం క్రమంగా కుదుటపడాలి. ఇక, గ్రహాలమాట అంటావా? భగవంతుని అనుగ్రహం మనపైన ఉండగా ఏ గ్రహాపుూ మనని ఏమీ చేయలేదు. అవి ఆయన నిర్ణయాన్ని అమలు పరచే అనుచరులు మాత్రమే. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనువాక్యాను వినిపించుకొని, నిర్ణయాన్ని ఆయనకు వదలి ఆయన నిర్దేశం ప్రకారం నడుచుకోవడమే మనం చేయవలసింది. ఆయనకరుణామయుడు కనుక నీ కంటినీరు తప్పక తుడుస్తారు.

ప్రేమతో

.............

* ఈ లేఖలలో "మాస్టరుగారు" అని చెప్పబడినపుడల్లా సర్వసామాన్యంగా ఁవి ఇ. కె గారిని సూచిస్తుంది.

# ఒక పట్టాన తెలిసేది కాదు.

సోదరులకు......

ఏ సందర్భములోనైనా నా సహకారము కావలసి వచ్చినచో పోస్టు ద్వారా నన్ను సంప్రదిస్తూ ఉండవచ్చును. మొహమాటము పడనక్కరలేదు. నాతో ఉన్నవారిని ప్రేమతో మందలిస్తూ ఉండడము నేనుచేసే పనులలో ఒకటి. అది వ్యక్తుల యెడల గల ప్రేమతోనేగాని చిన్న చూపుతో మాత్రం కాదు. మాస్టరుగారి దగ్గర మేమూ అలాంటి శిక్షణే పొందాము.

లోకంలో రెండు తరహాల వారుంటారు. మొదటి తరగతి వారు తమ దగ్గరకు చేరినవారిని ఆకట్టుకొనే ప్రయత్నంచేస్తారు.

రెండవ తరగతి వారు తమకు దగ్గరైనవారిని తీర్చి దిద్దుకునే ప్రయత్నం చేస్తారు మొదటి తరగతి వారిని దగ్గరకు చేరిన వారికి తాత్కాలికమైన గౌరవం లభిస్తుంది. రెండవ తరగతి వారి దగ్గరకు చేరువైన వారికి శాశ్వతమైన ఆత్మీయత సిద్ధిస్తుంది. ఆత్మీయత కన్న గౌరవమే ముఖ్యమనుకొన్న వారు అనుభవము లేనివారు. ఆకట్టుకొనేవారు తమకు మచ్చికైన వారిని స్వార్థప్రయోజనాలకు వినియోగించుకుంటారు. తీర్చిదిద్దే స్వభావము కలవారు తమస్వార్థాన్ని కూడా చేరువైనవారిశ్రేయస్సు కొరకు త్యాగం చేస్తారు. ఆ త్యాగం ఎంతటి మహత్తరమైనదో ఒక పట్టాన తెలిసేది కాదు.

ప్రేమతో

.............

# వదిలించడమే తప్ప వదిలించుకోవడముండదు

సోదరులు......గారికి ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది.

మీకు అన్ని విధాలా సహకరించడానికే నేనున్నది. నేనెవరిని కేవలం ఒక ప్రేమంటుగా గాని, పనుండి వచ్చిన వ్యక్తిగా గాని చూడను. అందరూ నాహృదయంలోని వారు గానే నాకు భాసిస్తారు. అవసరంలో ఉన్నవారు, ఆర్తిలో ఉన్నవారు వారే నాకు కావలసిన వారు.

సామాన్యంగా మనిషి తనను కావాలనుకొంటున్న వారిని పిండి, తాను కావాలనుకొంటున్న వారికి పెడుతూ ఉంటాడు. అలాకాక, తాను కావలసిన వారే తనకు కావలసిన వారని తెలిసిన వాడికి వారితో ఉండడమే తప్ప వారిని పిండడం ఉండదు. వారితో ఉండడము, వారికి కావసిందే తన కర్తవ్యంగా నిర్వహిస్తూ ఉండడం అతడు చేస్తూ ఉంటాడు. కనుక, మీకు పట్టిన దుర్గతిని వదిలించడమే తప్ప మిమ్మల్ని వదిలించుకోవడముండదు.

అన్ని వివరాలతో ఉత్తరం వ్రాయండి.

ప్రేమతో

.............

# మూడూ కలసి వస్తే ముచ్చట

చిరంజీవి.........కు ఆశీస్సులు.

నీవు ఉత్సాహముతో వ్రాసిన ఉత్తరము అందినది... నుండి నీకు పుస్తకాలు అందే ఉంటాయి. శ్రీరామనవమికి మీరు తల పెట్టిన కార్యక్రమం దిగ్విజయంగా సాగుతుంది. ఆ ప్రాంతంలో మన కార్యక్రమ నిర్వహణకు కావలసిన పునాదులు ఏర్పడుతాయి ఇటు సందేశాన్ని అందించడంలోను, అటు సేవా కార్యక్రమాలు నిర్వహించడంలోను మీ బృందం చూపిస్తున్న చొరవ పెద్దల మెప్పును పొందుతుంది.

సమయం వచ్చినపుడు నేను మీ ఊరికి తప్పక వస్తాను. దున్ని క్షేత్రాన్ని సిద్ధం చేయవలసిన బాధ్యత మీది. క్షేత్రం సిద్ధం కాగానే వచ్చి విత్తనాలు వేయవలసిన బాధ్యత నాది. ఆ విత్తనాలు చక్కగా మొలకెత్తి వర్ధిల్లేటట్లుగా కరుణచూపవలసినవాడు దైవము. ఈ మూడు కలసి వచ్చిన చోట ముచ్చటగా పని జరుగుతుంది. ఆ ముచ్చట మీ ప్రాంతంలో జరుగుచున్నట్లుగా గోచరిస్తున్నది. మీరు చిరకాలం ఉత్సాహం, ఆ ఉత్సాహానికి తగిన క్రమశిక్షణ కలిగి జాతి శ్రేయస్సుకు పని చేయుదురు గాక!

ఆశీస్సులతో

..............

# పని చేయువలసినది - ఫలితం రావలసిందీ

ప్రియసోదరుడు.........కు

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది. నీవు పంపిన ... గారి లేఖ చదువుకున్నాను. అందరి తరపున ఆయన తెలిపిన ఆమోదము బాధ్యతాయుతమైన తీరులో ఉండి నా కెంతో తృప్తిని కలిగించింది. ఇకపైన కూడ మన గ్రామం ఆయనను పెద్ద దిక్కుగా వరించుట మన కర్తవ్యమని నా ఉద్దేశము. అన్ని విషయాలూ ఆయనతో సమీక్షిస్తూ ఉండండి పెద్దల అనుభవం యువకుల ఉత్సాహానికి ఎంతైనా అవసరం.

మీ ఆరోగ్యం ఎలాగ ఉన్నది? నీకు ఒక డోసు మందు పంపుతున్నాను. మందు వేసుకోడానికి బద్దకించకు.

ఇక్కడ కార్యక్రమములు చక్కగా సాగుతున్నాయి. సోదర బృందం రోజురోజుకూ పెరుగుతూ, సేవా కార్యక్రమములు మరింత విస్తృత పరిధిలో నిర్వహిస్తూవస్తున్నారు. మీరు కూడా అక్కడి కార్యక్రమములు నిర్వహిస్తూనే, మొత్తం మన ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించేట్టుగా తయారు కావాలి.

ఫలితాలను చూసి తృప్తి పడకండి. అవిదైవాను గ్రహానికి సంబంధించినవి. ప్రయత్నం చేయడంలో శ్రద్ధ వహించండి అది మన సాధనకు సంబంధించినది. మనకు సంబంధించినంతవరకు దృష్టి ప్రయత్నం మీద తప్ప ఫలితం మీద ఉండకూడదు. పని చేయవలసింది... ఫలితం రావలసింది, చేయువలసి

నదానిని కాకుండా, రావలసినదాని పైపు చూస్తున్నవాడు చేయవలసిన దానిని చెడగొట్టుకుంటాడు. మన దృష్టి ఎప్పుడూ చేయవలసిన దానిపై ఉండాలి. అది ఇంకా ఎంత తీరుగా చేయగలమో మనం చూసుకొంటూ ఉండాలి. మీ అందరిఎడల నా కర్తవ్యాన్ని నిర్వహించడంలో నేనదే చేస్తున్నాను. మీమీ బాధ్యతా నిర్వహణల్లో మీరూ అదే చేయండి. అప్పుడే నిజమైన ప్రశాంతి మనకు అనుభవానికి వస్తుంది.

...ప్రేమతో

## వాళ్ళ ఎకౌంటుకు జమ కట్టు

చి॥ సౌ॥ .........కు ఆశీస్సులు.

నీవు వ్రాసిన ఉత్తరం ఇప్పుడే అందినది. ఎందరో మహానుభావులు తమ అనుగ్రహమనే ఉయ్యాలలో నిన్ను ఊపుతూ ఉంటే వారి జోలపాట వినక గోల పెడతావేందుకు? తల్లిదండ్రులు ఎత్తుకున్నప్పుడు చంటిబిడ్డలకు కూడా మామూలుగా కనపడని వెన్నో కనబడతాయి, అవి మనం చూడగలిగినందుకు ఆనందించాలి గాని అభ్యంతరం చెప్పకూడదు. కాకపోతే ఆనందం అహంకారంగా మారకూడదు. మనం ఉన్నది తల్లి తండ్రుల భుజాలపైన అని తెలిసినంతవరకూ అహంకారము కలుగదు సంతానగోపాలం నీ విచ్చడం వారికి దేవుడు సంతానాన్ని ఇవ్వడం ఇలా జరిగిన ముచ్చటలే. వారు నిన్ను కీర్తిస్తే వెష్టపడకూడదు. అలాగని ఇష్టపడకూడదు. ఆ కీర్తన

లను మనలను ఎత్తుకు మోస్తున్న పెద్దల ఎకౌంటుకు జమ కట్టాలి బయట వారు మనను ప్రస్తుతించడం వారు భవబంధాల నుండి బయట పడేందుకు పనికి వస్తుంది. తోటిమనిషిలో దైవాన్ని చూడగలిగారంటే వారుఎదగడం ప్రారంభించారన్న మాట ఆ ఎదుగుదలకు మనం ఎందుకు అడ్డుపడాలి? కాకపోతే అవి మన ఎదుగుదలకు అడ్డం పడకూడదు. అందుకనే ఎత్తు కున్నవాళ్ళ ఎక్కౌంటులో జమకట్టమంటున్నాను.

పెద్దలు, నీవు రావడం నీ చేతుల్లో లేవట్లే పోవడం కూడా నీ చేతుల్లో లేదని చెప్పారని వ్రాశావు. అందులోనూ మిసాలాయన అసలు ఊరుకోడు. మాస్టర్లే మానవుల పిచ్చిని కుదర్చడంలో ఆయనకు పెద్దపీట వేశారు. అందుకనే మిసా లాయన్ని నమ్మితే బాగుపడ్డానికి కొద్దిమాసాలు చాలు. ఒక సారి ఆయన రైలెక్కిన తరువాత మనం ఎటు తిరిగినా ప్రయా ణం ఆయన వైపే సాగుతుంది. మనం ఎన్ని ఆలోచించినా మనకి పథాన్ని నిర్దేశిస్తున్నది ఆయన ఆలోచనమేనని కొంచెం యోచన చేస్తే తెలుస్తుంది. తెలియడం ఏమిటి? నీకు నిత్యమూ అనుభవం అవుతూనే ఉంది కదా! ఈ విరక్తి ఎందుకు కలుగు తోందో తెలుసునా? స్వార్థం ఎరుగని దివ్యజీవితంలో ముందు ముందు విశేషమైన రక్తిని అనుభవించడానికే. కాబట్టి వాళ్ళు చెప్పిన మాట బుద్ధిగా విను.

తమ్ముణ్ని గురించి కలవరపడుతూ వ్రాశావేమిటి? బాబా సన్నిధిలో ఉన్న బాబును గూర్చి కలతచెందడం తెలివైన పని అంటావా? వాడి సంగతి బాబాకి వదిలెయ్యలేవు? ఎటు పోయి ఎటు వచ్చినా ఆయన స్పర్శవాడిని వదలదు. వంటభం

పూర్తయ్యేదాకా ఆగకుండా మధ్యలో రుచి చూడడం ఎందుకూ? గొంగళిపురుగు సీతాకోక చిలుక అయ్యేదాక ఆగు బాబా తన సన్నిధి అనే గూడులో ఈ గొంగళిపురుగులను సీతాకోక చిలుకలుగా మార్చి పంపగలడు.

నేను నెలనెలా అటువైపు వెళ్ళి వస్తున్నాను. ఎరుగున్న వారందరూ నీ సంగతులు ఏ కరువు పెట్టుకుంటూనే ఉన్నారు. ఎవరి దర్శనం వారిదికదా. కాదనటానికి మనం ఎవ్వరం? పంచదార తియ్యగా ఉన్నదా అంటే చెరుకు గడ సిగ్గుపడ నక్కరలేదు. తన సార్థకతకు తనను సృష్టించిన దేవుని పాదాల ముందు అది కృతజ్ఞతతో శిరస్సు వంచి నమస్కరించాలి. అప్పుడు ఆ తీపిదనం ఇచ్చే దేవుడు ఇంకెంత తీపిగా ఉంటాడో దానికి బోధపడుతుంది. భగవంతుడి తీపిదనాన్ని అతని బిడ్డలైన జీవులకు అందించేటందుకు తాను ఒక నిమిత్తమని ఆ చెరుకు గడకు దర్శనం లభిస్తుంది. ఆదర్శనంలో ఇంకెంతో తీపిదనం ఉంటుంది. ఆ తీపిదనాన్ని నిరంతరంగా అనుభవించడంకోసమే సృష్టిలో ఇంత కథా నడుస్తున్నది.

ఆశీస్సులు.

## క్రమశిక్షణ

చి॥.........కు ఆశీస్సులు.

ఒక మంచి పనిని నిర్వహించడానికి సమర్పణ ఎంత అవసరమో సామర్థ్యం అంత అవసరం. ఉత్సాహం ఎంత అవసరమో ఉన్ముఖత్వం అంత అవసరం. క్రమశిక్షణ లేనినాడు మంచిపనిని గూర్చిన ఆలోచనలు కలల రూపాన్ని మాత్రమే పొందుతాయి. కలలో విషయం ఇలలో జరగాలంటే ఇలలో వరకూ పైనుంచి పయనించి రావాలంటే క్రమశిక్షణ అనే వాహనం కావాలి. క్రమశిక్షణ అంటే పనిని గూర్చిన టెన్షన్ కాదు. పని ఎడల మనకు ఉండవలసిన అటెన్షన్. ఒక పనిని నిర్వహిస్తున్నప్పుడు ఆ పనిని గూర్చి మనం మానసికంగా వత్తిడి ననుభవిస్తూ తోటివారిని కూడా నిరంతరం వత్తిడి చేస్తుండడం క్రమశిక్షణ అని కొందరను కొంటూరు. అది జీవహింస అవుతుందికాని క్రమశిక్షణకాదు. ఏ పనిని ఎప్పుడు చేయాలో, ఎలాచేయాలో, ఇతరులచేత ఎపుడు చేయించుకోవాలో ఎలా చేయించుకోవాలో తెలిసి నడిచిన వానిది నిజమైన క్రమశిక్షణ. తనకు తన సిబ్బందికి ఏ మాత్రము ఇబ్బంది అనిపించకుండా ఎటువంటి ఇబ్బంది ముంచుకు రాకుండా నడిచి నడిపిన వానిది నిజమైన క్రమశిక్ష.

తనకు తోచినట్లు మాత్రమే నడవాలనుకునేవాడు తన వారిని నడిపించాలనుకునేవాడు ఎంత పద్ధతి ఉన్నా నియంత అవుతాడు. కాని క్రమశిక్షణా పరుడు అవ్వడు. తనను బట్టి గాక పనిని బట్టిచూడ గలిగిన నేర్పరితనం తోటివారిని కలుపు కొని యోచించగలిగిన విశాలహృదయం, ఒకసారి అనుకున్న

దానిని నిర్వహించడంలో దీక్ష పూనడం క్రమశిక్షణా పరుని ముఖ్యలక్షణాలు అని చెప్పవచ్చు. క్రమశిక్షణా పరునికి ఉండవలసినవి రెండు. ఒకటి పెద్దలపట్ల వినయం రెండవది పిల్లలపట్ల అనునయం. ఈ రెండూ లేకుండా మనం ఎంత గొప్పపనిచేసినా అది రుచిలేని విలువైన ఆహార పదార్థంగా తయారవుతుంది.

పని చేయడం ఎంత అవసరమో ఆ పని చేయడంలో పద్ధతి అంత అవసరం. పని చేయడం వలన మనకు తోటివారికి ఎంతోకొంత ప్రయోజనం కలుగుతుంది. ఆ పని చేయడంలో పద్ధతి ఉండడంవల్ల మనిషికి సుఖం లభిస్తుంది. పద్ధతి వలన శరీరంలోని కోశాలు లయబద్ధంగా శ్రమిస్తాయి. పద్ధతి లేనప్పుడు మానవశరీరంలోని స్థూలసూక్ష్మ కోశాలు చెదురుబాటును ఉద్వేగాన్ని అనుభవిస్తాయి. పద్ధతి వలన సుఖం లభిస్తుంది. అంటే ఒక రకమైన ఈజ్. ఒకపాటగాడు పాటపాడేటప్పుడు అనుభవించే స్థితిలాంటిదది. అతడి శరీరం పనిచేస్తున్నా అతడు హాయిని అనుభవిస్తున్నాడు కదా:

మనిషికి కావసినవి రెండే. ఒకటి సుఖము, రెండు శాంతి పని చేయడంలో పద్ధతి నేర్పడంవల్ల సుఖం లభిస్తుంది. ఆ పని నుండి ఎటువంటి ఫలితం వస్తుందా అని ఎదురుచూచే స్వభావాన్ని సన్యసించడంవల్ల శాంతి లభిస్తుంది. ఫలితం మీద దృష్టి లేకుండా ఒకడు పనిచేస్తున్నాడనుకో! వాడికి పని చేయడంలో పద్ధతి తెలియదనుకో! అప్పుడు ఫలితాన్ని కోరనందువలన ఎందరికో అందని శాంతి, తృప్తి అందవచ్చు కాని, పనిచేయ

కావలెను. ఆ వ్యక్తిగా మీరు నియమింపబడినారు అనగా అందరూ కలిపి కృషిచేయునట్లు చూడవలసిన బాధ్యత మీది. తోటి సోదరులను ఉత్సాహపరచి, సమిష్టి కృషికి ఉన్ముఖులను చేయవలసిన బాధ్యత మీది. మాస్టరుగారికి మనసును సమర్పణ చేసి మీరు నిలచిన చాలు. కార్యక్రమమంతయు మీ ద్వార మున నిర్వహింపబడగలదు. తెర యొక్క సామర్థ్యముతో నిమిత్తము లేకుండగనే చలన చిత్రము లక్షలాది ప్రేక్షకులనానంద పరచినట్లుగా మీ వ్యక్తిగత సామర్థ్యా సామర్థ్యములతో నిమిత్తము లేకుండగనే వందలాదిమంది మీ కృషిలో మీ వెంట నడిచి రాగలరు. ఎట్లు చేయవలెనని ఆలోచింపకుడు. ఏమీ జరుగుట లేదని విచారింపకుడు "నా" ద్వారమున ఎప్పటి కప్పుడు ప్రణాళిక మీకు నడచి వచ్చుచుండును. ఆ జి. ఓ. (గాడ్సు ఆర్డర్) ను మీరు అమలు పెట్టిన చాలును. తెరపై చిత్రము నడిచినట్లు మీ జీవితమున మాస్టరుగారు ప్రతిబింబించ గలరు. ప్రస్తుతము మీరు నిర్వహించవలసిన అంశములను వరుసగా యిచ్చుచున్నాను. వాటిని ఈ క్షణము నుండి ఆచరణలో పెట్టగలరు.

సోదర బృందమంతయు ప్రతి ఆదివారము కలుసుకొని, వైద్యసేవ, సద్గోష్ఠి నిర్వహించి, జరిగిన కార్యక్రమములను సమీక్షించుకొని, జరగవలసిన కార్యక్రమమును నిర్ణయించు కొనుట.

2... గారిచే భాగవత రహస్య ప్రకాశముపై ఉపన్యాసము వెంటనే ఏర్పాటు చేయగల్గుట.

3. వివేకానంద మందిరమో, వేరే ఏదైనా మరొక మందిరమో నిర్ణయించుకొనగల్గుట.

పై అంశములను చక్కగా అవగాహన చేసుకొని ఆచరణలోనికి తెచ్చుకొని నాకు ఉత్తరము వ్రాసినచో మీకు కావలసిన వనరులు ఒనకూడ గలవు.

ప్రేమతో

..........

## అందరినీ కలిపేటందుకే

విశాఖపట్టణం
8. 12. 78.

...... కు ఆశీస్సులతో కృష్ణస్వామి వ్రాయునది. నేనిచ్చటకు క్షేమంగా చేరినాను, మీ కార్యక్రమములు దినదిన ప్రవర్ధమానముగా సాగుచున్నట్లు తలచుచున్నాను. మీ ఊరి విశేషములను విని మాస్టరుగారు సంతసించి ఆశీర్వదించినారు. వారి ఆశీస్సులు మనలను మరింత ముందుకు నడిపించగలవు... గారి భాగవత రహస్య ప్రకాశ ప్రవచనము మీ ఊరిని మరొకసారి బృందావనపురముగా మార్చగలదు. భాగవత ప్రకాశము మీకు ఊరిలోని పెద్దలందరినీ కలుసుకొను భాగ్యము కలగజేయగలదు. దానితో మీకు మీ ఊరిలో అంతర్యామిత్వము సిద్ధించగలదు. పెద్దలను దర్శించండి. వారి చరిత్రలలోని హరి లీలలను రుచి చూడండి. మీకు భాగవతము

ప్రత్యక్షానుభవము అగుగాక! మీరు ప్రారంభించినారో లేదో పాలిక రూపులలో భాగవతము మీకు ప్రత్యక్షమైనది. ఇకదానిని సాధుజనులకు అందించగల అదృష్టము మీది. కలిసికట్టుగా పనిచేసి ఇచ్చటనున్న కార్యకర్తల మెప్పును పొందగలరు. సత్యమేమనగా అందరినీ కలుపుటకే మంచిపనులున్నవి. నలుగురూ ఒకటగుట గమ్యము. మంచి పని అట్లగుటకు సాధనము. సాధనము మీ కడకు నడచి వచ్చినది. గమ్యమునకు చేరగలరు.

మీ ఊరిలో రెండుచోట్ల వైద్యాలయములు ప్రారంభించితిరనియు, రోగులు ప్రవాహమువలె నడచి వచ్చితిరనియు తెలిసినది. బాగున్నది కాని, రోగులకు న్యాయముచేకూర్చుటకు మీరు క్రమశిక్షణా యుతమైన కార్యక్రమమును చేపట్ట వలసియున్నది.

...అతడు, అతని తోటివారు ఒళ్ళు దాచు కొనకుండ శ్రమించ గలరు. బాధ్యతగా రోగులకు మందులివ్వగలరు. ఎప్పటి కప్పుడు ఎవరెట్లున్నదీ నాకు తెలియజేయగలరు. కాని, మందులు ఒక్కసారిగా కావలసిన వన్నీ ఏర్పాటు చేయుట వారికి సాధ్యము కాదు. అది మీరు చూడవలసిన పని. ఆ కుర్ర వాళ్ళలోని దీక్షకు, ఉత్సాహమునకు మీరు రూపకల్పన చేయవలసియున్నది. అనగా, మీఊరిలో అన్ని హంగులతో కూడిన వైద్యాలయ సామగ్రి అతి త్వరలో ఏర్పడవలె నన్నమాట. అట్లేర్పడినచో మీరు నడుపుచున్న అన్ని వైద్యాలయములకు ఏలోటు లేకుండా జరిగిపోవుట సాధ్యమగును. కనుక వెంటనే మందుల పైకి దృష్టిమళ్ళించండి. "ఇంత పెద్దకార్యము

మనకు సాధ్యమా? అన్న భయం వీడి, అంత పెద్ద కార్యము నకు మనము సాధనమని మాత్రము దర్శించి ఉపకారమునకు ఉపక్ర మించండి. మనము మంచి పనులకు సంబంధించిన వారము కాని, మంచి పనులు మనపై ఆధారపడి యుండవు. చేయించు కొనదలిచిన వేళ ఆ మంచి పనులే వలసిన సామర్థ్యమును మనకిచ్చి నడిపించును.

వైద్యాలయముల నిమిత్తముగా రోగుల వేషమున వారి మీకడకు నడిచి వచ్చుచున్నాడు. అతనిని ఆదరించి, ఆర్తి తీర్చి అతని అనుగ్రహమునుబడయ వలసినది.

1. భాగవతుల తలుపు తట్టుట

2. బాధార్తులకు తలుపు తీయుట— ఈ రెండు మీరు చేయవలసిన పనులు.

ఆశీస్సులు

..............

విశాఖపట్నం,
15-12-1978.

## మానసిక ఆహారం

... ... ...కి ఆశీస్సులు.

రోజురోజుకూ ప్రయోజనాత్మకమైన పద్ధతిలో ముందుకు సాగుతున్న మీ కార్యక్రమాలను గూర్చిన ఉత్తరం అందినది. సంతోషం. మీరు క్రమశిక్షణతో చేస్తున్న పని ఇచ్చటి వారిలో ప్రతిబింబిస్తున్నది. ప్రతిబింబించి, మీకు కావలసిన వనరులను ఇక్కడ నుండి మీకడకు పట్టుకొని వచ్చుచున్నది. ఈ మొత్తము క్రమశిక్షణాయుతమైన కార్యాచరణకు ఫలము. మీరు చేస్తున్న సత్కర్మాచరణమనే టార్చిలైటులో మీరొక్కొక్కరూ ఒక్కొక్క బ్యాటరీ. మీ అందరి ద్వారా లోకానికి ప్రసరిస్తున్న వెలుగు మాస్టరుగారు. మీ అందరూ సిద్ధమైతే స్విచ్ నొక్కడానికి ఉన్నవాణ్ణి నేను. మాస్టర్‌గారి స్మరణతో ఈ బ్యాటరీలు నిరంతరం ఛార్జ్ (Charge) అవుతూ లోకానికి తరుగని కాంతిని ప్రసరింపజేయుగాక!

డిస్పెన్సరీ నిర్వాహణ విషయంలో మీరు తీసుకున్న నిర్ణయం ఆచరణీయమైనది. ఎవరికీ ఇబ్బంది కలగకుండా, అందరూ పాలుపంచుకొని సమిష్టిగా మీరు చేస్తున్న కృషి సత్ఫలితాలను ఇవ్వగలదు. కేసుల విషయంలో ఎప్పటికప్పుడు వివరంగా నాకు వ్రాస్తూ ఉండండి. ఒకరోగి మన దగ్గర కోరి మందు తీసుకొంటున్నాడంటే మనపైన విశ్వాసంతో తన ఆరోగ్యాన్ని తీర్చిదిద్దే బాధ్యత మనకప్పగించాడన్నమాట. ఆ

బాధ్యతను మనం గుర్తించి ఉచితంగా సేవచేయాలి. ఉచితంగా అంటే తగిన రీతిలో బాధ్యతతో అని అర్థం.

.........గారు భాగవత్ ప్రకాశాన్ని అందిస్తూ అనుభూతిలో ముంచెత్తుతారని మన సోదరుల నుండి రోజూ కనీసం ఒక ఉత్తరమైనా వస్తున్నది. ప్రారంభించేటప్పుడు నా దగ్గర ఉన్నది అక్షరజ్ఞానం మాత్రమే అన్నారాయన. కావలసినదదొక్కటే అక్షర జ్ఞానం. అంటే నాశములేని, తరగని, శాశ్వతమైన జ్ఞానమని అర్థము. అలాంటి దివ్యజ్ఞానం ఆయన వాక్కుల ద్వారా మిమ్ములను చేరి మీకు మానసిక ఆహారమై మిమ్ములను నిరంతరము పోషించుచుండునుగాక!

ఆశీస్సులతో

... ... ...

## తలుపు తెరుపు

విశాఖపట్టణం,
4-1-80.

చి॥ సౌ॥... ... ...కు ఆశీస్సులు.

నీవు వ్రాసిన ఉత్తరములు అందినవి. ఇప్పుడు నీవు మనస్సుతో చేయవలసినది ఆలోచన కాదు, ఆరాధన. నీ మనస్సులో ఉండవలసినది ఆవేదన కాదు, భగవంతునికి నివేదన. ఇప్పుడు నీ ప్రశాంతత కడుపులోనున్న వానికి ఎంతగానో ఉపయోగపడగలదు. పరిష్కారము ఆలోచించుటవలన రాదు. పెద్దలు చెప్పినట్లు ఆచరించుటవలన వస్తుంది. బాధలు పెరుగు

తున్న కొద్దీ బాధలతో బాటు ఆలోచనలు పెంచుకొంటే మన స్సుకు పిచ్చిఎక్కుతుంది. బాధలతోపాటు భక్తిని పెంచుకొంటే మనస్సుకు ముక్తి లభిస్తుంది. బాధ, దిగులు, అధైర్యము, అస హానము ఇవి కూడని లక్షణాలు. వీటిలో మనము మునిగి ఉన్న పుడు ఈ కన్నీటిపొరలు కమ్ముటవలన పైవారు మనకు అంది స్తున్న చేయూతను చూడలేము. ఆ చేయూతను సద్వినియోగ పర్చుకోలేము కనుక, ఎట్టి పరిస్థితులలోను నిరాశ నిస్పృహ లకు లోను కాకూడదు. నిరంతరము దైవధ్యానములో మన స్సును నిలిపి ఉంచడము కర్తవ్యము, బాధల గురించి ఆలో చించినకొద్దీ అవి మరింత ఉగ్రరూపము ధరిస్తాయి. భగవంతు డిని గూర్చి స్మరిస్తే బాధలనుండి విముక్తి అప్రయత్నంగా లభిస్తుంది. బాధలు అంటూ వేరేలేవు. ఎదురైన సన్నివేశా లను తట్టుకొనే శక్తి సామర్థ్యాలు మన దగ్గరలేనపుడు వాటిని బాధలు అని పిలుస్తాము. అప్పుడు నిరాశ నిస్పృహాలకులోనై ఉన్న శక్తి సామర్థ్యాలుకూడ కర్పూరములాగ హరించి పోతాయి. విశ్వాసముతో భగవంతుని స్మరిస్తే సన్నివేశాలు తట్టుకొనే శక్తి సామర్థ్యాలు మనకు ప్రవహిస్తాయి. దైవాన్ని స్మరించడము అంటే మానవత్వానికి దివ్యత్వానికి మధ్య ఉన్న తలుపు తెరుస్తున్నాము అన్న మాట. ఆ తలుపు తెరిస్తే మన లోను ఆ దివ్యత్వమే నిండుతుంది.

గ్రహించు, అమాయకురాలివి. అయినా నీ వెనుక నీవు నమ్మిన అభయహస్తము ఎప్పుడూ ఉన్నది. దానికి తెలుసు నిన్ను ఎలా రక్షించుకోవాలో పిల్ల తనని ఎలా ఎత్తుకోవాలో తల్లికి నేర్పవలసిన అవసరమున్నదా? క్రిందకు చూడకు, నీ

జీవితము కనిపించి నిన్ను భయపెడుతుంది. పైకి చూడు. నిన్ను కరుణించే హస్తము చేయూతనిచ్చి అక్కున చేర్చు కుంటుంది. నీకు పుట్టబోయే వానికి ఆశీస్సులు. తరచూ ఉత్త రము వ్రాస్తూండు.

ఆశీస్సులతో

... ... ... ...

విశాఖపట్టణం,
20-7-1980.

## చిన్న త్యాగం చేయగలగాలి

యోగ సోదరులు............గారికి

మాస్టరుగారి ఆశీస్సులతో కృష్ణస్వామి వ్రాయునది మీరు వ్రాసిన లేఖ అందినది. దివ్య ప్రేమతో కూడిన మీ వాక్యసముదాయము నాకెంతో ఆనందాన్ని కలిగించ డమే కాక మాస్టరుగారి స్పర్శను మరింతగా అనుభవింప చేసాయి. మీరు ప్రార్థన క్రమం తప్పకుండా చేస్తూ మాస్టరు గారి చేయూతలో యోగమార్గంలో ముందుకు నడుస్తున్నం దుకు నాకెంతో ఆనందంగా ఉంది.

లోకంలో చాలామంది "ప్రపంచమంతా నాశనమైన దనీ క్షణికమనీ ఎన్నెన్నో కల్పించుకొంటూ అసలు మరచి అనవసరమైనవి ఫలిత శూన్యమైన ప్రయోగాలు, యోగాలు, వ్రతాలూ చేస్తూ అహంభావులై తమతమ వాక్చాతుర్యముతో అనేక విధాల భావాలను కల్పించిచెప్పి మేమే గొప్పవారమని

తెలుస్తూ ఉంటారు అని లోకం యెడల ఒకవిధమైన ఆర్తిని చెంది వ్రాసారు.మీరు వారందరూ సరైన మార్గంలో పడి సరి దిద్దబడాలని మీ కోరిక. ఈ కోరిక నెరవేరే సూత్రం ఒకటి చెబుతాను మీరిచ్చిన చనువును ఉపయోగించుకొంటున్నందుకు మన్నించండి. లోకం బాగుపడాలంటే వారిని నిందించిగాని, వ్యతిరేకించిగాని లేదావారినిగూర్చి బాధపడిగాని మనంచేయగలి గింది ఏమీ ఉండదు. లోకం దైవం యెడల కళ్ళు తెరవాలి అంటే మనం వాళ్ళలాంటి స్థితిలో ఉన్నా ప్రేమించగలగడం ఒక్కటే మార్గం. మాస్టరుగారిని స్మరించి ఆయన మననుండి పరమప్రేమగా వ్యక్తం అవుతుండగా ఆ ప్రేమమయ ప్రవర్తనతో తోటివారికి సేదతీర్చగలగడం మనం అభ్యసించినపుడు తోటివారు మనసాటి వారై క్రమంగా సాధకులై మనకు సహచరులై తరించ గలుగుతారు. ఈ సందర్భంలో మనం మరో చిన్న త్యాగబుద్ధిని చూపవలసి ఉంటుంది. మనచేత మేల్కొల్పబడ్డవాడు మన మాస్టరుగారికే నమస్కరించాలని మనం మొండి పట్టుపట్టకూడదు. స్వయంవరంలో ఎవరి భర్తను వారు ఎంచుకున్నట్లు ఎవరిమనస్సుకు నచ్చిన రూపాన్ని వాళ్ళను వరించనీయాలి. అన్ని రూపాలలోను ఉన్నది మాస్టరు గారేకదా! ఆహారాన్ని స్వీకరించే ధర్మం అందరికీ సమానమే అయినా ఎవరికి నచ్చిన ఆహారాన్ని వారు స్వీకరిస్తూ తృప్తి పడుతూ ఉంటారు కదా. దైవం విషయంలో కూడా జరిగేది అంతే.

ప్రేమతో

..............

విశాఖపట్టణం,
21-7-80.

# నిందించను నేను నిందించను

సోదరుడు ... ... ...కు

అభినందనలతో కృష్ణస్వామి వ్రాయునది. నీ లేఖలో నీవు చూపిన నిష్కర్ష, ధీరత్వం, ధైర్యం నాకు ఎంతో నచ్చాయి. ఆనాటి ఉపన్యాసంలో మీరిచ్చిన సమస్యకు సమాధానం ఉన్నది. కాని మీరు పట్టుకోగలిగేందుకు వీలుగా నేను మరికొంత వివరించి ఉండవలసింది. నేను నా ఉపన్యాసంలో నినాదాలనుగాని నేటిలోకపు పరిభాషలనుగాని ఉపయోగించ లేదు, అందువల్ల ఇచ్చిన టాపిక్‌కు, నేను చేసిన ప్రసంగానికి సంబంధం లేనట్లుగా మీకు అనిపించి ఉండవచ్చు. ఆవేశం లేకుండా సరదాగా ఉండేటట్లుగా నేను చెప్పడం కూడా మీకా అభిప్రాయం కలగడానికి కొంత కారణం కావచ్చు. ఆనాడు నేను మానసికంగా ఎలాటి టెన్షన్ (Tension) నూ అనుభవించకుండా వినేవాళ్ళకు కూడా ఎలాంటి మానసిక శ్రమా, కలుగకుండా అహ్లాదకరంగా ఉండేటట్లుగా అసలైన విషయాన్ని తగుమాత్రం అందించడం జరిగింది.

1. స్వధర్మ నిర్వహణలో మానవుడు ఎన్నడూ ఏమరపాటు పడకూడదు.

2. స్వధర్మ నిర్వహణకు స్వార్థం గమ్యం కాకూడదు.

3. కేవలం లోకశ్రేయస్సే గమ్యంగా జీవించడంలో సుఖమూ తృప్తి ఉన్నాయని మానవుడు గ్రహించాలి.

4. అవసరానికి మించిన సంపదలను కూడబెట్టుకోవడం వల్ల భీతి పెరుగుతుందే తప్ప ఒరిగేది ఏమీ ఉండదు.

5. తనచుట్టూ ఉన్న ప్రకృతిని గమనించుకొంటూ దానివలె నిష్కామంగా విధి నిర్వహణ చేయడంలో మానవుడు సిద్ధహస్తుడైననాడు సమస్యలనేవి మరి యుండవు.

ఇవి నేను ఆనాడు నా ఉపన్యాసంలో సోదరులందరికి బోధపరచడానికి ప్రయత్నించిన ప్రధానాంశాలు. ఈ అంశాలు గమనించుకొన్ననాడు మానవుడు సుఖపడతాడు కనుక ఇది శాశ్వత సందేశం. ఈ అంశాలను మరచిననాడు. మానవుడు నానారకాల వికారాల పాలవుతాడు. కనుక అన్నిరకాల సమస్యలకూ పరిష్కారంగా నేను పైన చెప్పబడిన మారని సందేశం మరోసారి గుర్తు చేసాను. సందేశం మారనిది అని నేను ఉద్ఘాటించిన మాట నిజం. సమాజం మారలేదు అనిగానీ,సమాజం మారడం అంటూ ఉండదు అనిగానీ నేను చెప్పలేదు.సమాజం మారడం అంటే పై అంశాలను విస్మరించి దిగ జారడమే కనుక ఆ అంశాలను మరొక్కసారి గుర్తు చేయడమే నా కర్తవ్యంగా నేను భావించాను. చిత్రం ఏమిటంటే పరిష్కారం చూపక పోయినా వేదికపైన ఆవేశపడితే అది అభ్యుదయం క్రింద చెల్లుబడి అవుతూ ఉంటుంది. చల్లగా మెల్లగా చెబితే పరిష్కారం ఉన్నా యువతరానికి (అందులో కొందరికి) అభ్యుదయం కాదేమోననిపిస్తుంది.

మన సోదరుడింటి దగ్గిర మీరు నన్ను అనేకమైన ప్రశ్నలు వేసారు. ప్రస్తుత పరిస్థితుల్ని రకరకాలుగా న్యా

దృష్టికి తెచ్చి వాటికి పరిష్కారాలడిగారు. నేను వాటికి సమాధానాలిచ్చాను. నేనే దృష్టితో చూస్తానో కూడ మీకు పూర్తిగా వివరించి చెప్పాను. నేను ఒక పార్టీకి ఒక మతానికి చెందిన వాణ్ని కాదనీ, లోక శ్రేయస్సే నాకు ముఖ్యమనీ నిర్మొహమాటంగా మీకు వివరించాను. నన్ను మీరు ఆ సమాధానాలలోనే అర్థం చేసుకొని ఉంటారని భావించాను.

ఇక ఉపన్యాసానికి వస్తే అక్కడ అన్ని రకాల వాళ్ళు ఉంటారు. ఎవరికి వారు తమ సిద్ధాంతానికి అనుగుణంగా వక్త మాట్లాడితే బాగుంటుంది అనుకుంటారు. మార్క్సిజం చెప్పలేదని మీరు బాధపడినట్లే ఇంతకూ అద్వైతాన్ని చెప్పలేదేమి అని బాధపడినవారు కూడా ఉన్నారు ఏ "ఇజమయినా మన కిప్పుడు కావల్సింది నిజం" ఏ సిద్ధాంతమయినా ఇపుడు జరగవలసింది సాంఘిక సహ జీవనానికి జనం సిద్ధపడడం, ఎవరి ప్రకారం చెప్పడం అనేది కాక ఆ ఇజాలూ, సిద్ధాంతాలూ ప్రవచించిన వారందరూ ఏ లోక శ్రేయస్సును కాంక్షించారో దాని మీద దృష్టి పెట్టడం ఇపుడు ముఖ్యం. ఇజాలు, మతాలూ అనే గదుల్లో నుంచి మనం అంతా కామన్ హాలులోనికి చేరవలసి ఉంది. గదులు ఉండడం తప్పు కాదు. గదులు వేరనుకోవడం ఒక గదికి మరొక గదికి పడదు అనుకోవడం తప్పు. ఆ గదులు అన్నిటికి పైన ఉన్నది ఒకే కప్పు (Top) దానినే లోక శ్రేయస్సు అంటారు. ఎవడు ఏ గదిలో నుంచి పైకి చూసినా కనబడేది అదే ఫలానా గదిలో నుంచి చూస్తేనే కప్పు కనబడుతోంది అనుకోవడం కొంచెం కుత్రతనం. పైకి చూడదలచిన వారికి ఎక్కడ నుంచి చూసినా కప్పు కనబడు

తుంది. లోకహిత దృష్టి కలవారికి ఏ ఇజం అయినా, ఏ మతం అయినా ఉపకరణంగా పనికి వస్తుంది. లోక హిత దృష్టిలేన ప్పుడు ఎంత మంచి సిద్ధాంతానికి సంబంధించిన వాళ్ళం అని చెప్పుకున్నా ఒరిగేది ఏమీ ఉండదు. భారతదేశంలో మార్క్సిజం వ్యాపించవలసి నంత వ్యాపించలేక పోవడానికి కారణం అతని దోషం కాదు. అతని అనుయాయులమని చెప్పుకుంటున్నవారి ఎదగనితనమే దానికి కారణం. మార్క్సిజాన్నిగాని, మరో ఇజాన్నిగాని మనం "గుర్తించండి మొర్రో" అని అరిస్తే ఎవ్వరూ వినిపించుకోరు. దాని ప్రకారం మనం నడచుకొన్న ప్పుడు మాత్రమే మరో నలుగురు మనతో అడుగులు వేస్తారు మార్క్సిజాన్ని గురించి గాని, మరో ఇజాన్ని గురించిగాని చెప్పేవాళ్ళు కాదు కావాల్సిందిప్పుడు. దానిపై గురివుంచి నడిచేవాళ్ళు కావాలి. మార్క్సిస్టులమని చెప్పుకుంటూ శ్రమ జీవుల దగ్గర చందాలు వసూలు చేసి, వారి కొరకు అనే సాకుతో రాజధానీ నగరాల్లో జల్సాలు చేసే నాయకులు ఎంత మంది లేరు? కొందరు బ్రతుకు తెరువు కోసం గాంధీ పేరును వాడుకొంటున్నట్లే మరి కొందరు శ్రమ జీవుల్లో తాము నిల దొక్కుకోవడం కోసం మార్క్సు పేరును వినియోగించు కొంటున్నారు. ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే నేడు మనం చూస్తున్న సమస్యలన్నిటికీ కారణం సమదృష్టి లోపించడం చిత్త శుద్ధి కరువై పోవడం. ఇవి రెండూ లేని వారు ఏ ఇజం ముసుగులో ఉన్నా ఒక్కటే. ఇజాలు బట్టలు లాంటివి. శవా నికి ఎంతక్రొత్త బట్టలు తొడిగినా పెళ్ళికొడుకని చెప్పలేం కదా. అలాగే సమదృష్టి, చిత్తశుద్ధిలేనివారు ఏ ఇజం పేరు

చెప్పుకున్నా, ఏ రంగు జండా పట్టుకున్నా ఎంత హంగూ హంగామా పెంచుకున్నా జరిగేదీ ఒరిగేదీ ఏమీ ఉండదు. కనుక నాకు అవకాశం ఉన్నంత వరకూ నాకు చేతనైనంత వరకూ ప్రజల్లో ఆ సమదృష్టినీ చిత్తశుద్ధినీ తిరిగి నెల కొల్ప డానికి ప్రయత్నిస్తున్నాను. నాచేత మేల్కొల్పబడ్డవాడు ఏ ఇజంలో చేరినా, ఏమతాన్ని అనుసరించినా నాకు ఇష్టమే. నాకుకావల్సింది వ్యక్తి నీతికినిలబడడం.నిజాయితీగాబ్రతకగలగ డం. తన తోడిదే లోకం అని తెలిసి సమదృష్టితో చిత్తశుద్ధితో జీవించడం. ఈ ప్రబోధాన్ని అందించడానికి ఏ వేదికయినా ఒకటే నాకు. అది జాతీయ సాహిత్య పరిషత్తు కావచ్చు, కార్మేడ్స్ కార్నరూ కావచ్చు. నన్ను వారు ప్రబోధించ మని అడిగి నపుడు నాకు తోచింది వారు వినదలిచినపుడు నాకు అభ్యంతరం ఎందుకు?

నిందించడంలో, నినదించడంలో నాకు విశ్వాసం లేదు. ఆచరణయోగ్యమైన మార్గంలో నడుస్తూ నడవదలచిన వారికి చేయూత ఇవ్వడమే నాకు ముఖ్యం. నేను చేయవలసిన పని చాలా ఉన్నప్పుడు నిందించేంత ఖాళీ నాకు కనబడడంలేదు. నిందించవలసిన అవసరమూ కనబడటంలేదు. తిట్టడం వల్ల కాకుండా వెన్ను తట్టడం వల్ల జాతి దారిన పడుతుందని నా విశ్వాసం, అనుభవం.

నేనూ నీలాంటి వాణ్ణే. సహృదయంతో స్వీకరించగలవని నాకు తోచింది వ్రాసాను. నీ సత్యాన్వేషణ నిరంతరం సాగాలనీ నీ పవిత్రత కలకాలం నిలవాలనీ, నీనిష్కర్ష నిరంతర కృషితో కలిసి పదిమందికి వెలుగు దారి చూపాలనీ హృదయ పూర్వకంగా కోరుతూ

ప్రేమతో

... ... ...

## పడవ ప్రయాణం

విశాఖపట్టణం,
30-8-80.

చి॥ సౌ॥ .........కి ఆశీస్సులు.

ఏ సమస్యలూ లేకుండా ప్రశాంతంగా......లో మీ కుటుంబ జీవనం చక్కగా కొనసాగుతున్నదని విశ్వసిస్తున్నాను. మన దృష్టి దైవం మీద ఉన్నప్పుడు వాతావరణ ప్రభావం మనమీద పడదు. వాతావరణ ప్రభావానికి మనం లోనుకానప్పుడు ఎపుడు ఏది చేయాలో అప్పుడే దానిని చేస్తూ చెక్కు చెదరని కర్తవ్య నిర్వహణలో ముందుకు సాగగలము. పడవ నడపడం చేతనైన వాడికి నదిలో ఎన్ని నీళ్ళున్నా పెద్ద విశేషంకాదు. పరమాత్మ ఎడల గురి కుదిరిన వారికి పరిస్థితులు ఎలాంటివయినా బెంగలేదు. జీవితంకూడ పడవ ప్రయాణం లాగే లీలగా నడిచి పోతుంది.

ఆశీస్సులు

... ... ...

# సేవించడానికేగా నేమన్నది

విశాఖపట్టణం,
31-8-80.

చి॥సౌ॥.........కు ఆశీస్సులు.

నీ ఉత్తరం అందింది. నీవు కోలుకుని ఇంటికి చేరినందుకు మేం ఆనందించాము. ఇకనుంచైనా శరీరాన్ని అలక్ష్యం చేయకుండా జాగ్రత్త పడతావని ఆశిస్తున్నాం.

ఎందుకనో నీకు జీవితం మీద ఒకరకమైన విరక్తికలుగుతోంది. దానితో నీవు చనిపోవాలని కోరుకోవడం, అందుకు ప్రయత్నించడం జరుగుతూ వచ్చింది. చివరిసారిగా, నాముందు నీవనుభవించిన వేదనతో జీవితం ఎడల నీకున్న విరక్తి దైవం ఎడల అనురక్తిగా రూపొందడం ప్రారంభించింది. ఇక పైన క్రమంగా అశాంతి, అసహనం, అలక్ష్యం అనే మబ్బులు విడిపోయి వివేక సూర్యోదయం స్పష్టంగా నీ జీవితంలో జరుగుతుంది.

"ఎందుకు బ్రతకాలనేది అర్థం కావడంలేదు"— అని వ్రాశావు. "ఇందుకు బ్రతకాలి" —అని మీ నాన్నగారు నీకు తన యింటిని అప్పచెప్పి వెళ్ళారు. ఆ యింటిలో అనేకాలైన సమస్యలుండవచ్చు. అవి అలవి కానివి అనిపించవచ్చు. కానీ అంతమాత్రాన నీవు విరక్తిచెందడం భావ్యం కాదు. రోగి పరిస్థితి సీరియస్ అయినప్పుడు ఒక్కొక్కసారి డాక్టర్‌కు తన శక్తి చాలదనిపించవచ్చు. తన చేతిలో లేదనిపించవచ్చు.

అప్పుడు సాధ్యమైనంత వరకూ శక్తి వంచన లేకుండా ప్రయత్నించడం డాక్టర్‌కు ధర్మంగానీ, విరక్తితో పేషంటును విడిచిపెట్టి వెళ్ళిపోవడం డాక్టర్‌కు ధర్మం అవుతుందా? పనులు అవడం కాకపోవడంతో మనకు సంబంధం లేదు. మన బాధ్యతల్ని నిస్సంగంగా నిర్వర్తించడం వరకే మన బాధ్యత.

ఇక ఎందుకు బ్రతకాలి అన్న ప్రశ్నకు రెండవ సమాధానం—నిన్ను నమ్మి, నీ వెలుగులో నడవాలని కోరుకుంటున్న కుటుంబాలు కొన్ని ఉన్నాయి-అని నీకు తెలుసు. నీమాట వేదవాక్కుగా స్వీకరించి అనుష్ఠించే వ్యక్తులు కూడా ఎందరో ఉన్నారు. తమ భవిష్యత్తు నీవు చెప్పిన ప్రకారమే మలచుకోవాలని నీవు చెప్పిన మార్గమే తమకు మేలైనదనీ భావించి ఆరాధించే వ్యక్తులున్నారు. అంటే, దైవశక్తి నీ ద్వారా వ్యక్తులకు అందుతున్న దన్నమాట అలా. అందటానికి ఆ దైవశక్తి నీ శరీరాన్ని ఒక కేంద్రంగా స్వీకరించి నీ ద్వారా వ్యక్తమవుతోంది. నీ శరీరాన్ని, లోపలి సూక్ష్మకోశాలనూ తగిన మార్గంలో శుద్ధి పరచి, సిద్ధపరచి సమర్పించవలసిన బాధ్యత నీపైన ఉన్నది. ఒకరికి యిచ్చివేసిన వస్తువుపై మనకు ఎలా అధికారం లేదో అలాగే దైవశక్తికిసమర్పించబడిన శరీరంపై కూడా మన నిర్ణయాలకు తావుండదు. ఉండకూడదు.

నీకు మీ నాన్నగారు కనబడి నీతో సంభాషించే సన్నివేశాన్ని గూర్చి వ్రాశావు. అది భ్రమ కాదు. తప్పకుండా అవకాశం ఉంది. ఇకపైన అలా జరిగినప్పుడు నీకు నీరసం రాదు. నీకు నన్నూ, మాస్టరుగారినీ చూపించింది కూడా మీనాన్నగారే. ఈసారి యీ విషయాన్ని గురించి ఆయనే నీకు వివరిస్తారు.

అమ్మవారు నీకు కనబడటం, నీతోకలసి సంచరించడం, నిన్ను పలకరించడం మొదలైన అనుభవాలు ముమ్మాటికీ సత్యాలు. ఒకవేళ భ్రమ అనుకున్నా భ్రమకూడా అమ్మవారిలో భాగమేకదా! అందుకే ఆమె భ్రమరాంబ. అది యోగలక్షణమే గాని రోగలక్షణంకాదు. అమ్మవారినీ నిన్నూ అభేదంగా చూసి పరవశించే వ్యక్తులు నీకు ఆప్తులైన వారిలో ఎందరో ఉన్నారుగదా! అదే నీయెడల అమ్మవారికిగల ప్రసన్నతకు నిదర్శనం. ఇకపైన ఎవరైనా హారతిస్తే వద్దుఅనకు. నీ శరీరం అమ్మవారికి ఒక ఆలయం అనిగుర్తుంచుకో.

ఎదుటివారిని నొప్పించకుండా జీవించగలిగే స్వభావం నీకు అలవడేట్లు చూడమని ప్రార్థన. నీలో విస్తరిస్తున్న ప్రేమ తప్పక ఆ సహనాన్ని అలవడేట్లు చేస్తుంది. శరీరకోశాల ఎడల నీవు శ్రద్ధ వహించిన కొద్దీ నీ ప్రవర్తనలో దివ్యత్వం ఎక్కడ ఏ రీతిగా వ్యక్తం అవ్వాలో అక్కడ ఆ రీతిగా వ్యక్తం అవడం జరుగుతుంది. ఇకపై నీవు తగిన శ్రద్ధ వహిస్తావు గనుక అచిరకాలంలో అందరూ నీ వలన తృప్తిని అనుభవిస్తారు.

నీ జాతక చక్రం పంపించావు. నీలాంటి వాళ్ళమీద గ్రహాలు అంతంత మాత్రంగానే పనిచేస్తాయి.

అయినప్పటికీ కావలసినవివరాలు కొద్దికాలంలో తప్పక తెలియజేస్తాను. నీవు వ్రాసిన నీ జీవిత చరిత్రను నాకు తప్పక పంపించు.

"ఈ సారి నేను......వచ్చి మీ అందర్నీ చాలా బాధ పెట్టాను"—అని వ్రాశావు. మేం ఎవ్వరం అలా అనుకోవడం లేదనీ, మాకది శ్రమ కాదనీ నీహృదయానికి తెలుసు. "ఈ సారి మీతో కూడా సేవలే" అని వ్రాశావు. మిమ్మల్ని సేవించడానికే గదా నేనున్నది. లేకపోతే నేనుండడానికి అర్థమే లేదు. లోకానికి వెలుగునిచ్చే ఒక జ్యోతిని పరిస్థితుల పెనుగాలులకు రెపరెపా కొట్టుకుని ఆరిపోకుండా చూడగలిగాననే తృప్తిచాలు నాకు. మొన్నటి......యాత్రతో నీ జీవితంలో నూతన ఘట్టం ప్రారంభం అయింది. ఈ ఘట్టంలో జరగబోయేవన్నీ సుఖసంతోషాలను వెల్లివిరియుచేసే సన్నివేశాలే.

ఆ నేన్నులతో

... ... ...

# పిల్లవాడిలా తల్లడిల్లకు

విశాఖపట్టణం
5. 9. 80.

సోదరుడు ......... కు ఆశీస్సులు.

మన ఎడల ఒక విధమైన ఆపేక్షను పెంపొందించుకుని మనని గురించి బాధ్యతతో పని చేసిన పెద్దవారి యెడల కుర్రవాళ్ళమైన మనం ఎలా ప్రవర్తించాలో నీకు తెలియుంది కాదు. తొందరపడి ఆవశ్యకత లేనిచోట మనం అసహనాన్ని ప్రదర్శించినపుడు ఆ పెద్దవారికి అసంతృప్తి కలుగుతుంది. ఇంత శ్రద్ధగా పనిచేసిన వారికి మనవలన అసంతృప్తి కలగడం మనకు క్షేమదాయకం కాదు. వాళ్ళెంత బాధ్యతతో పని చేసారో గ్రహించడానికి మనం చాలా ఎదగవలసియుంటుంది. కృతజ్ఞత చూపించ వలసిన వారి యెడల మానసికంగా తుకతుక ఉడికిపోవడం నిలాంటి సజ్జనులకు తగనిపని. స్నేహితునిగా, శ్రేయోభిలాషిగా ఈ సందర్భములో నేను నీ హితాన్ని కోరి మందలిస్తున్నాను. నేను బాధ్యత తెలియనివాడను కాను. నా దృష్టిలో డబ్బుకు విలువ లేకపోవచ్చు కానీ మరొకరికి నష్టం రానివ్వను. ఎవరి కర్తవ్యాన్ని వారి దృష్టిలో వారి కొరకు నిర్ణయిస్తానే తప్ప నా లక్షణాలను ఎవరిపైనా ఎన్నడూ రుద్దను. నేను దేని గురించి ఆలోచించను కానీ అశ్రద్ధ

మాత్రం చెయ్యను. పట్టించుకోను కానీ పతనం కానివ్వను. వీధి అరుగుపై ఆడుకొంటున్న పిల్లవానిని గూర్చి వంటయింటిలో పనిచేసుకుంటున్న తల్లి పట్టించుకో లేదనడం సత్యం అవుతుందా? పిల్లవాడికి "మా అమ్మ నన్నిక్కడ వదిలి పెట్టింది, నేనేమైపోతాననుకుంది? నా కన్న ఆమెకు వంటే ముఖ్యంగా కనిపిస్తోంది. ఇప్పుడు నేను ఇక్కడ నుంచి వెళ్ళిపోతే ఆమె ఏం చెయ్య గలదు?" అనిపించవచ్చు కాని తల్లి వంటింట్లో ఉన్నా ఆమె మనస్సు వీధి వరకూ వ్యాపించి ఉంటుందనీ ఆమెకు ఒడలెల్లా కనుపించని కళ్ళున్నాయనీ, ఆమె చేతులు ఎక్కడున్నా తనను చుట్టే ఉంటాయనీ ఆ పిల్లవాడికి తెలియదు. తల్లి ప్రేమ తెలియని పిల్లవాడిలా తల్లడిల్లకు.

ప్రేమతో

..........

# నేనెవరినీ పొగడను

విశాఖపట్టణం.
10-8-80

చి॥ సౌ॥ ......... కు ఆశీస్సులు.

నా ఉత్తరాన్ని చూసిన ఆనంద పారవశ్యంలో తెలియాడుతూ నీవు వ్రాసిన లేక అందుకొన్నాను. "మీకునామీద ఓవర్ కాన్ఫిడెన్స్ అనుకుంటాను అని వ్రాసావు. ఒక చిత్ర కారుడికి కుంచె పట్టిన తొలిక్షణం నుంచీ తాను వ్రాయబోయే దృశ్యం యొక్క పరిపూర్ణ రూపం సాక్షాత్కరిస్తూనే ఉంటుంది. అతడు కుంచెను ఎటు నుంచి ఎటుకదిపినా ఏ చిన్న గీతను వ్రాసినా ఆ పరిపూర్ణమైన దృశ్యాన్ని తన మనోనేత్రంతో తిలకిస్తూనే వ్రాస్తాడు. అలాగే గురువు తన శిష్యున్ని తీర్చి దిద్దేటప్పుడు కూడా అతడున్న స్థితిని గాక ఉండవలసిన స్థితిని చూస్తూతదనుగుణంగా ఆతన్ని తీర్చిదిద్దుతూ ఉంటాడు. ఆ సత్యాన్ని పూర్తిగా గ్రహించలేని శిష్యుడికిఅది ఓవర్ కాన్ఫిడెన్స్ అనిపించవచ్చు. అనిపించడం సహజం. గురువు వాక్కు నిజమేనని అనుభవానికి రావడమూ సహజమే.

సంవత్సరం మొత్తంలో ఆగస్టు నెల చాలా స్పెషల్‌గా ఉంటుందని వ్రాసావు. నిజమే, అది భూమాతకే స్పెషల్ నెల ఎందుకంటే శ్రీకృష్ణుడు, సి. వి. వి. అరవిందుడు, మన మాస్టరు ఇ. కె. దేహధారులై దిగివచ్చిన నెల అది. మరి అంతో ఇంతో సాధన ఉన్న ప్రతివారికీ ముఖ్యంగా నీలాంటి వారికి ఆ

నెల స్పెషల్ గానే ఉంటుంది. ఆ స్పెషాలిటీని అన్ని నెలలలో నూ నింపెట్టు కోవడానికే మనం సాధన చేయవలసిఉంటుంది.

భాగవతం అర్థమవుతుందా? అని వ్రాసావు. తప్పకుండా అర్థం అవుతుంది. అర్థం అవడం కోసమే మాష్టరుగారు అహార్నిశలూ భాగవత ప్రకాశాన్ని రచిస్తున్నది. మొదటి భాగం నుండి చదవడం మొదలుపెట్టు. అర్థం కానిది ఏమైనా ఉంటే నాకు వ్రాయి. అది చదవడం మొదలు పెడితే అసలు పెద్దల పుస్తకాల్ని మనం ఎలా చదువుకోవాలో అర్థమవుతుంది. అలా చదువుకోవడం చేతనవుతుంది.

ఆశీస్సులతో

..........

## ఆశపడడం ఆచరణకు నాంది పలకడమే

విశాఖపట్టణము
12-9-80

సోదరి ...ఆశీస్సులు-

నీవు దివ్యానుభూతితో వ్రాసిన ఉత్తరంఅందుకొన్నాను. ఆ ఊరు మీరు ప్రవేశించగానే క్రమంగా మీకు కావలసిన వాతావరణం రూపదిద్దు కుంటోందని తలుస్తాను. జీవితంలో వాటికి అవిగా వస్తున్న మార్పులను మనం కాదని ఘర్షణపడ నక్కరలేదు. నెట్టుకొని వస్తున్న మార్పులు దైవం మన మేలు కోరి పట్టుకొని వస్తున్న మార్పులుగా దర్శిస్తున్న కొద్ది మన మనస్సులు మరింత ప్రశాంతిని అనుభవించ గలుగుతాయి.

తెరలో నుండి వేదిక మీదకు దర్శకుని అనుమతి లేకుండా నటుడు ఎలా ప్రవేశించలేడో అలాగే ఏ పెద్ద మార్పు కూడా జగన్నాటక సూత్రధారియైన ఆ దైవం యొక్క అనుమతి లేకుండా మన జీవితంలో కలుగబోదు.

"ఆశయితే ఉందిగానీ ఆచరణలో పెట్టలేక పోతున్నాను." అని వ్రాశావు. ఆశపడడం అంటే ఆచరణకు నాంది పలకడమే. నీ ఆచరణకు తగిన మనోబలం, ధైర్యం ఎప్పటికప్పుడు "నా" నుండి నీకు లభిస్తూనే ఉంటాయి. మీ శ్రీవారిని, పిల్లలనీ దేవుని సన్నిధిలో కంటికి రెప్పలా కాచుకోనడమే నీవు చూపవలసిన ఆచరణ. వారి రూపంలో నీచేత సేవలు అందుకొంటున్నది దైవమేనన్న సత్యాన్ని గ్రహించు. వారిరూపంలో ఉన్నది దైవమే నన్న భావన నీలో స్థిరపడిన కొద్ది దైవం నీకు ఎంత చేరువగా ఉన్నాడో బోధపడి ఆశ్చర్య ఆనందాలు కలుగుతాయి. మీరు ప్రస్తుతం ఉన్న ఇల్లు చాలా బాగుంది. అన్నిటికీ అనుకూలంగా ఉంటుంది

చిరంజీవులను అడిగినట్లు చెప్పు. వారి భవిష్యత్తు ఉజ్వలమైనది. మీరు ఉత్సాహంతో వారికి శిక్షణ ఇస్తే చాలు. వాళ్ళు ఉత్తములుగా రూపొంది వర్ధిల్లుతారు వారి చిట్టి నమస్కారాలు నాకెప్పటికప్పుడు అందుతూనే ఉన్నాయి.

"మీకు వీలయినప్పుడు తప్పక జవాబు వ్రాయగలరు" అని వ్రాసావు. మీకు ఆవశ్యకత ఏర్పడినప్పుడల్లా నాకు జాబు వ్రాయడానికి వీలు అవుతూనే ఉంటుంది.

దేవయానములగు పథములు శివములు అగుగాక।

ఆశీస్సులు.

# దేవుడు కర్తవ్య స్వరూపుడు

విశాఖపట్టణం
28-11-80

చిరంజీవి......ఆశీస్సులు.

మీ గురు శిష్యులు కలిసి వ్రాసిన ఉత్తరంఅందింది. నీకు ఇకపైన చదువుపైన శ్రద్ధ పెరగాలి. నీలో వస్తున్న మంచిమార్పులతో బాటుమంచిమార్కులుకూడారావాలి గురువుగారిపాదంబట్టి చదువు కొనడం చెడగొట్టుకున్నాడన్న చెడ్డ పేరు తెచ్చుకోకూడదు. మనం చదువుకోవడం మన స్వధర్మం. స్వధర్మ నిర్వహణలో నిష్ఠ కుదిరినపుడు మాత్రమే మనం మాష్టరుగారికి దగ్గరకాగలం. కర్తవ్యాన్ని విడిచి పెట్టి దేవుడి ఫోటో ముందు కన్నులు మూసుకున్నవాడు కర్తవ్యం యెడల కన్ను మూసుకున్నవాడు అవుతున్నాడు. దైవం కర్తవ్య స్వరూపుడై ఉన్నాడు. ఆ కర్తవ్య స్వరూపుణ్ణి ఆరాధించేడందుకుగాను మనం చేసే అభ్యర్థన మన ప్రార్థన. కనుకనే ప్రస్తుతం నీ మిత్రుడు చెస్తున్న నిరంతర స్వధర్మ నిర్వాహణ నాకు నచ్చుతుంది. నీవు కూడ అలాగే నీవు నీస్వధర్మంలో నిష్టనుకుదుర్చుకో. ఒక్కమాటమాత్రం గుర్తుపెట్టుకో. ప్రతీఆదివారం సాయంత్రం జరిగే ప్రార్థన ఉపన్యాసాలకు మాత్రంఅందరూ హాజరు కావడానికి ప్రయత్నించండి శిక్షణ పొందుతున్న మీరంతా ఎక్కడెక్కడ ఉంటున్నా ఏమేమి చేస్తున్నా ఆదివారం సాయంత్రం జ్ఞానాలయంలో ఉండగలిగితే మళ్ళీవారానికి సరిపడ మాష్టరుగారి వెలుగును పొందడానికి వీలేర్పడుతుంది. ఆ

అవకాశాన్ని కోల్పోకండి. మీరందరూ ఒక్కటేనన్న భావన భావనగాగాక అనుభవంలోకి మారాలంటే అదొక్కటేమార్గం. ఆదివారం వేదవారంగా, వేదికపైనున్నవారు మాస్టరుగారి స్వరూపంగా మనం దర్శించాలి. ఆ దర్శనంలో మనమంతా పులకించాలని కోరుతూ

ఆశీస్సులతో

## చంటివాడి ఫోజు

విశాఖపట్టణం
27-1-81

పూజ్యసోదరుడు ......... కి

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది నీవు వ్రాసిన ఉత్తరం చూసి చాలా ఆనందం కలిగింది. చంటివాడు తన అన్నలను చూసి అమ్మదగ్గర పాలు త్రాగే అధికారం నాకే ఉంది అన్నట్లు ఫోజు పెడతాడు. కాని ఆ పై వాళ్ళందరూ త్రాగినవే. అ త్రాగిన చోటు నుండే తాను త్రాగుతున్నా డన్న సత్యం నిదానం మీదగాని తెలుసుకోలేడు. మాస్టరుగారి సన్నిధిలో మేమంతా అలాగే చంటివాళ్ళ . నిదానిస్తున్న కొద్దీ మీ జీవితాలు ఎంత విలువైనవో మాకు దర్శనమిస్తోంది. నేను చంటి వాణ్ణిగదా, అమ్మనన్ను ఎత్తుకుంటుంది అను కునే చంటివాడికి తన అన్నలకు అంతకు ముందు ఎన్నెళ్ళ

నుండి అమ్మ ప్రేమ లభించిదనే సత్యాం అనుభవంలోకి రావ డానికి సమయం పడుతుంది. అలాంటి అన్నల కథలన్నీ అమ రిక చేసి అందించడానికే ఈ చంటివాడు ప్రయత్నిస్తున్నాడు. ఈ నా ప్రయత్నానికి అన్నల ఆశీస్సులు అండదండలు అప్ర యత్నంగా లభిస్తాయని ఆశిస్తున్నాను.

ప్రేమతో

..........

## కుండకు చిల్లు పడనీయవద్దు

విశాఖపట్టణం.
28-4-81

ప్రియసోదరులు______గారికి,

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది. మీ ప్రేమాభిమా నములు అక్షర రూపం ధరించి మీ లేఖ రూపంలో నా కం దాయి, మీ ఊరిలో మనం గడిపిన మధుర క్షణాలు ఇప్పటికీ ఎప్పటికీ గుర్తుంటాయి. ఆ క్షణాలు మనకథలోనే గాక ఆ ఊరి కథలో కూడా మలుపును త్రిప్పగల సామర్థ్యం కలవని, అది మన స్వామి సంకల్పమని నాకు అనిపిస్తోంది.

అతను మీకు కలవడం, కలిసిన కొద్ది రోజుల్లోనే సోదర బృందం వారితో మీకు సన్నిహిత సంబంధం ఏర్పడటం, ఇం తలో మన ఇరువురి కలయిక చిత్రంగా తటస్థించడం ఇవన్నీ హిజ్ అప్పాయింట్ మెంట్ His appointmentకు సంబంధించినవి. ఇవిఇంకా ఎంత దూరం లాక్కు వెళతాయో ఆయనే చెప్పాలి.

మీ ఉత్సాహం, కర్తవ్యనిర్వహణలో మీ కున్న దీక్ష, వాదాలకు, అంతస్థులకు అతీతమైన మీ మంచితనం నాకెంతో నచ్చాయి. మీరు చాలా అదృష్టవంతులు. మీలో పోగొట్టుకో వలసినవి ఏమీ లేవు. ఉన్న మంచి గుణాలను మంచి వారితో కలిసి పెంచుకోవడమే మీరు చేయవలసిన పని.

కలిసిరాని వాళ్ళను గూర్చి మనం ఆలోచించే పనిలేదు. మనం ఆలోచించవలసింది కలిసివచ్చే వాళ్ళను గురించే. కలిసి వచ్చే వాళ్ళతో కలిసి మెలసి కార్యక్రమ నిర్వహణ జరుపుకోవ డంలోనే మనకున్న శక్తియుక్తులన్నీ వెచ్చించబడాలి. కలిసి రాని వాళ్ళను గురించి ఆలోచించినపుడు మన మనస్సు అనే నీటి కుండకు చిల్లు పడినట్లు అవుతుంది. అప్పుడు నీరు కారిపో తుంది తప్ప ఉపయోగపడదు. అలాగే మన శక్తియుక్తులు ఖర్చయిపోతాయి. మనం మాత్రం మిగిలిపోతాం. ఉన్న కాపిని నీళ్ళు సద్వినియోగ పరచుకున్న వాడు ధన్యుడు. అలాగే మన మనస్సుకున్న శక్తియుక్తులను సద్వినియోగ పర్చుకోవాలి అంటే, మనం "పాజిటివ్ సైడ్" మాత్రమే చూస్తి ఏది "పాజిబులో" అది చేసుకుంటూ వెళ్ళి పోవాలి. మన ప్రయ త్నానికి ఎపుడూ దైవం తోడౌతాడు.

స్వామి కృపవల్ల మీ సత్సంకల్పాలనే విత్తనాలు మీ ఊరి క్షేత్రంలో మొలకెత్తి కుసుమించి ఫలించుగాక!

ప్రేమతో

సం/...

# మనుషుల్లో రకాలు

విశాఖపట్టణం
25-7-1981

పూజ్య సోదరుడు ......... కు,

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది. నీవు వ్రాసిన ఉత్తరం అందినది. పరిస్థితులు బోధపడినవి. నీ ప్రయత్నములు తప్పక ఫలించగలవు. ఇనుపముక్క గొడ్డలిగాను, కొడవలిగాను మారాలను కొన్నప్పుడు అది నిప్పులలో కాలక తప్పదు. కమ్మరి అనేకసార్లు దానిని కాల్చుతూ సాగదీస్తూ నీటిలో ముంచుతూ సుత్తి దెబ్బలకు సరిచేస్తూ ఉంటాడు. ఈ మొత్తము క్రతువు ఆ ఇనుప ముక్కను ఉపకరణముగా తయారు చేయడానికే కదా!

అలాగే సమర్థుడై పదిమందికి పనికి వచ్చేవాడుగా కావాలని కోరుకున్నప్పుడు ప్రకృతి తగిన సన్నివేశాలద్వారా మనకు శిక్షణను ఇస్తూ ఉంటుంది. ఆ శిక్షణ ఒక్కొక్కప్పుడు కఠినంగాను, జటిలంగాను అనిపించవచ్చు. కాని ఈ శిక్షణ వలననే సాధకుడు ఆరితేరి ఆరిందా కాగలుగుతాడు. సీరియస్ కేసులు ఎక్కువగా వచ్చినపుడే వైద్యుడు తన వృత్తిలో లోతులు చూడగలుగుతాడు. ఇపుడు మీరందరూ అట్టి శిక్షణే పొందుతున్నారు.

మనుష్యుల్లో రెండు రకాల వారుంటారు. ఒకరకము వారు ఇతరులను ఎలా ఉపయోగించుకొందామా అని చూస్తారు. రెండవరకము వారు తోటివారికి ఎలా ఉపయోగపడ గలుగుతామా అని చూస్తూఉంటారు. సాధకుడి చుట్టూ ఈ రెండు రకాలవారూ ఉంటారు. సాధకుడు ఏం చేయాలో తెలుసా? ఉపయోగించుకొనే స్వభావంగల వారికి తాను ప్రేమతో ఉపయోగపడాలి. ఆపైన ఇంకేమీ వారికి బోధించ కూడదు. బోధిస్తే మనతోపని ఉంది కాబట్టి వింటారు గాని ఆ బోధను వారేమీ సద్వినియోగపరచుకోరు. తోటివారికి ఉప యోగపడే స్వభావం కలవారికి మాత్రమే బోధిస్తూ ఉండాలి. అదికూడ తగుమాత్రంగా తెచ్చుకున్న పాత్రనుబట్టి "నది" నీళ్ళిచ్చినట్లు ఉండాలి మనబోధ. తనలో ఉన్ననీటిని బట్టిగాక తెచ్చుకున్న పాత్రను బట్టేగదా అది నీళ్ళిస్తోంది. ఇంతకూ ఇదంతా ఎందుకు చెప్పానంటే మీ స్నేహితుడు...ప్రేమావే శంతో ఈ రెండురకాల వారినీ విభాగం చేసుకోకుండా ఒకే విధంగా అందరికీ బోధిస్తూవచ్చాడు.

పరిస్థితులు మారేటప్పటికి మొదటి రకంవారు ముఖాలు మాటుచేసుకున్నారు. అది తప్పు కాదు వాళ్ళస్వభావమే అంత. రెండవరకం వాళ్ళు ఇప్పుడతనితో నిలబడి ఉన్నారు. ఇప్పుడ తనికి అతనితో పనిచేసేవారికి ఇది వడపోత కాలము. ఈ వడ పోతలో కొద్దిమంది మిగులుతారు. ఇక తన శక్తి యుక్తులన్నీ ఈ మిగిలిన వారికొరకు మిగిలిన వారితో కలిసి వినియోగ పర చడం కొరకు.

ఆగష్టు 4వ తేదీతో సన్నివేశాలు ఒక దారికి వస్తాయి. 11వ తేదికి మీరు కోలుకొని క్రొత్త ప్రణాళికలు వేసుకోగలుగుతారు. ఆగష్టు నెల ఏకష్టాలు లేని స్థితికి మిమ్మల్ని తీసుకువెళ్ళగలదు. మీ విశ్వాసమే మిమ్మలను రక్షించగలదు. నీ ఆరోగ్యమునకు బెంగలేదు.

"నా వెంట నుండు వారికి ఎన్నడూ భద్రమే".

ప్రేమతో

... ... ...

# భయపెట్టేందుకు రాలేదు అభయం పట్టేందుకు వచ్చారు

విశాఖపట్టణం,
24-1-82.

ప్రియ సోదరులు......గారికి

మీరు వ్రాసిన ఉత్తరం అందినది. మీ సంశయాలు సహజంగానే కనపడ్డాయి. వెలుగును దర్శించి దానికి దగ్గరవుతున్న తొలిరోజులలో ఎవరికైనా సహజంగా కలిగే సందేహాలే యివి.

మాస్టరుగారిని చూసి భయపడవలసిన పనిలేదు. ఆయన మనను భయపెట్టడానికి దిగిరాలేదు. మనకు అభయం పట్టడానికే దిగి వచ్చారు. మనం చనువు తీసుకోగలగాలే గాని ఆయన ఎప్పుడూ సిద్ధంగానే ఉన్నారు. మన సంశయాలు చిన్నవయినా పెద్దవయినా వాటిని పూర్తిగా తీర్చి మనకు స్ఫూర్తిని కలిగించి మనను తీర్చిదిద్దడానికి.

"వివాహితుల మయిన మాకు" "సంసారులమయిన మాకు" "ఆయనతో ముఖాముఖి మాట్లాడటం సాధ్యమా"? అని వ్రాసారుమీరు. మీ మాటలలో చెప్పలేని బాధ ఏదో వ్యక్తం అవుతున్నది. మీరు వివాహితులు. మీరు ఉత్తరం వ్రాసిన నేను వివాహితుణ్ణి. మీరు మాట్లాడాలనుకొంటున్న మాస్టరుగారు కూడా—వివాహం చేసుకొని కుటుంబంతో నిండుగా వుంటున్న వ్యక్తి. అసలీ సృష్టే ప్రకృతి పురుషుల దివ్యదాంపత్యం వల్ల రూపు కట్టుకుంటోంది. అట్లాంటప్పుడు వివాహం చేసుకున్న వాళ్ళం అని తప్పు చేసినట్లు మాట్లాడవలసిన పనిలేదు. వివాహం మనకామం కోసం చేసుకొంటే మనం చేసుకొన్నట్లు అవుతుంది. అలాకాక మన తరవాత తరం దిగి రావడం కొరకు చేసుకుంటే అది దైవసంకల్పానికి అనుగుణమైనదై దివ్యమయిన బాధ్యతా స్వీకారమవుతుంది. భాగవతంలో కర్దమ ప్రజాపతి తన తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమయిన నారయణుని సృష్టి కార్య నిర్వాహణలో తనకు తగిన భార్యను అనుగ్రహించమని వరం కోరుకున్నాడు. రఘు వంశపు రాజయిన దిలీపుడు వశిష్ఠుని ఉపదేశంతో నందిని ధేనువును సేవించి తన భార్య వలన పుత్రసంతతిని పొందాడు. కాబట్టి వివాహ ధర్మం సృష్టికి సంబంధించినది. సృష్టిలో శరీరలను ధరించిన మనమీద కూడా ఆధర్మం వర్తిస్తున్నది. దాన్ని కోరికగా కాక ధర్మంగా ఎరిగి ప్రవర్తించిన వారు ధన్యులవుతారు. కోరికల స్థితినుండి బాధ్యతల స్థితికి మనను ఉద్ధరించడానికే తాము దిగి వచ్చారు కనుక మన కొరకు దిగి వచ్చిన మాస్టరు గారితో మాట్లాడడానికి మనం జంకనక్కరలేదు.

వారంటే ఏమిటో వారెందుకు దిగి వచ్చారో వారి కార్యక్రమం ఎమిటో వారి ఉపన్యాసాలలోను వారు వ్రాసిన వ్రాస్తున్న వారిపై వెలువడుతున్న గ్రంథాలలోను స్పష్టంగా వివరించ బడుతూనే ఉంది. ఆ సందేశంతో మీ జీవితాన్ని తీర్చి దిద్దుకుంటూ ప్రేయస్సులో వారిని తలుచుకొని నమస్కరించు కొంటే చాలు. దూరం దగ్గరలతో నిమిత్తం లేకుండా వారిసాన్నిధ్యం మీకు ఎప్పుడు ఎంతగా అవసరమో అప్పుడు అంతగా లభించ గలదు. మహాత్ముల సాన్నిధ్యం విద్యుచ్ఛక్తిలాంటిది. ప్రవర్తన సరిచేసుకోవడంలో మన కేండిల్ ప్రవర్ పెరుగుతున్న కొద్ది అవి మన నుండి తగినంతగా వ్యక్తం అవుతూవుంటుంది. ప్రార్థనలో క్రమశిక్షణతో పాల్గొంటున్న కొద్ది సంశయాలు వాటికి అవిగా తీరి జీవితంలో సత్కర్మాచరణ నిండి పండుతుంది. సంశయాలు చిన్నపిల్లలకు కలిగే సందేహాలులాంటివి. అమ్మా నాన్నలను ఇదేమిటి అదేమిటి అని వేదించుకు తినే పిల్లలే వయస్సు వచ్చి పరిసరాలు తమకు తామే బోధపరచుకో గలిగినట్లు ప్రార్థనలో సత్కర్మాచరణలో మనం క్రమశిక్షణతో పాల్గొంటున్న కొద్దీ మన ప్రజ్ఞ విచ్చుకొని మన జన్మకు తెల్లవారుతుంది. అప్పుడంతా వెలుగే. ఎవరికైనా ఈ సందేహాలు తీరవలసినవే. అందుకే మాస్టరుగారు మనకు ప్రార్థనతో పాటు సత్కర్మాచరణను విధించారు. అంటే సందేహాలు తీరే మార్గాన్ని ఆయన మన ముందే ఉంచారన్నమాట ఇక మనం ముందుకు సాగడమే తరువాయి.

నిత్యజీవితంలో పాటించేటందుకు నియమావళి ఉంటే బాగుంటుంది అని వ్రాసారు మీరు నిజమే. ఇక్కడ ఒక సూక్ష్మం వుంది. మీరు క్రమం తప్పకుండా ఉదయం,సాయం త్రం సరిగా 6గం॥లకు ప్రేయరు చేసికొని చూడండి. కొద్ది వారాలు గడిచేటప్పటికి మీ జీవితం నియమబద్ధం అవుతుంది. ఒక వేళ మీ దినచర్యలో మార్పులు అవసరం అయితే అసూచ నలు మీకు ప్రేయరులోనే అందుతాయి.

సృష్టి చేయాలన్న సంకల్పం భగవంతుడికి ఎలా కలి గింది అని మిమ్మల్ని మీ స్నేహితుడు ప్రశ్నించాడన్నారు. ఈ ప్రశ్నకు చక్కని సమాధానం మీకు "దర్శనాలు-నిదర్శనాలు" అనే "నా" గ్రంథంలో లభ్యం అవుతుంది. "దర్శనాలు-నిదర్శ నాలు" సందేహాలు సమాధానాలు,సంభాషణలు,సమన్వయాలు లోకయాత్ర, ఇష్టాగోష్టి మీ మనస్సుకు చక్కని వికాసాన్ని కలిగించి ఈ స్థితిలో మీకు తోడ్పడే గ్రంధాలు. వాటిని అధ్య యనం చేయండి.

ఆశీస్సులు

... ... ...

# సుశీల కథను ఒకసారి చదువు

విశాఖపట్టణం
12-10-82

చి॥సౌ......కు ఆశీస్సులు. నీవు వ్రాసిన ఉత్తరం అందింది. చాలా రోజులకు నీనుండి యోగ క్షేమాలతో అందిన ఉత్తరం చూసి ఆనందించాను. నీకు పూర్వపు పరిస్థితి మళ్ళీ రావడం అనేది ఉండదు. శ్రద్ధగా మందువాడు. ఆరోగ్యం కుదుట పడుతుంది. పరిస్థితులు సర్దుకోవడానికి మరి కొంత కాలము పడుతుంది. ఓపికతో వేచి ఉండు. భారత దేశంలో సాంప్రదాయసిద్ధమైన కుటుంబములోని సామాన్య స్త్రీకి తన జీవిత నిర్వాహణమే ఒకసాధన! కుటుంబ నిర్వాహణమే ఒక తపస్సుగా కనబడుతున్నాయి. అందుకనేమో స్త్రీలు వేదాలు వేరే చదువనక్కరలేదన్నారు. వేదనలను ఓర్పుతో సహించి కష్టాలతోనే కాపురం చేస్తున్న ఈ స్త్రీమూర్తికి ఏ వేదాధ్యయన పనుమూ సాటిరాదు. పురుషుడు కోరితన జీవితాన్నినియమించుకోవాలి. అందుకే అతడు స్వయంగా ప్రయత్నిస్తే తప్ప బాగుపడలేడు. స్త్రీని వాతావరణము, జీవితసన్నివేశాలే నియమిస్తాయి. జీవితమే ఆమెను హద్దులో నిలిపి పట్టాలపైన నడిపిస్తుంది. కావాలని చెడిపోకుండా ఉంటే చాలు. స్త్రీజీవితమే ఒక సాధనమై సార్థకతను అనుగ్రహిస్తుంది. అవకాశం కలిగినపుడు తెచ్చాలి రామకృష్ణునిపాండురంగ మహాత్యంలోని సుశీల కథను ఒకసారి చదువు. ఆ కథ నీజీవితానికి దగ్గరలో ఉంటుంది.

ఆశీస్సులతో

# కాబట్టే వాళ్ళు చూడరు

విశాఖపట్టం.
9-2-83

చి॥ సౌ॥ ......... కు ఆశీస్సులు.

మీరు వ్రాసిన ఉత్తరం అందింది. మీరు వ్రాసిన అం శాలు మీ అనుభవంలో నుండి వ్యక్తమైనవి. సహజీవనానికి ఎక్కువ మంది వ్యక్తులు సిద్ధంగా లేకపోవడం మనకు అన్ని చోట్లా కనబడుతూనే ఉంది. వారి విషయమై ఎంత ఆలోచిం చినా ప్రయోజనం అంతగా ఉండదు. మార్పు ఒకళ్ళు తెచ్చేదికాదు. ఎవరికి వారిలో వచ్చేది. విషయములు తెలియని వాళ్ళు తక్కువ. తెలిసిన మంచి మార్గం ప్రకారం నడుచుకోవ డానికి కొందరు సిద్ధపడుతున్నారు. కొందరు సిద్ధపడడం లేదు. అలా సిద్ధపడనివారికి మంచి విషయములు మన కంటె ఎక్కువ తెలుసు. మన కన్నా వారే బాగా చెప్పగలరు. సిద్ధపడడానికి విషయాలు తెలియడానికి ఏమీ సంబంధం లేదు. అలా సిద్ధపడ నివారు తను వ్యక్తిత్వాన్ని వదులుకోకుండా గట్టిగా పట్టు కుంటారు గనుక వాళ్ళ సంఖ్య పెరిగిన కొద్దీ ఘర్షణా అశాంతీ పెరగడం తప్పదు ప్రేమలేని జ్ఞానం వ్యర్థం. తెలివితో ఆజ్ఞాపించేవాడు కాదు. మాస్టరుగారిలా ప్రేమతో పెదవివిప్ప కుండా హద్దులలో పెట్టగలిగినవాడు కావాలి. మాస్టరుగారి చుట్టూ ఇలాంటివి ఎన్నో వేల మనస్తత్వాలు ప్రదక్షిణాలు చేస్తున్నాయి. అందరి సంగతి పూర్వాపరాలతో సహా ఆయ నకు తెలుసు. కాని అవకాశమున్నంతవరకూ ఓర్పుతో సహి

స్తారు. తమ వెలుగుతో పొదుగుతాయి. తాను చేస్తున్న నిరంతర కృషికి ఫలితం మిదా యని పట్టించుకోని నిష్కామ కర్మ యోగమాయనిది. ఫలితం వైపు చూసినప్పుడు గుండెతరుక్కుపోక తప్పదు. కాబట్టే వాళ్ళు చూడరు. ఫలితాన్ని గురించి ఆలోచించే సమయాన్ని కూడా వారు పనికే వెచ్చిస్తారు. మనం కూడా ఆయనలా చేయడం నేర్చుకుందాం. ఆయనలా పని చేయాలి అంటే ఆయనలా ఉన్నప్పుడే సాధ్యం. పరిస్థితుల కతీతంగా పరమ గురువుల కృషిలో వర్ధిల్లగలరు.

ఆశీస్సులతో

..........

## పైవాడి పరిహాసం

విశాఖపట్టణం.
17-2-83

సోదరులు.........కి

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది. మీరు వ్రాసిన ఉత్తరం అందింది. మాస్టరుగారి ప్రేయరుతో పాటుగా గాయత్రీ జపం చేసికొనుట సంప్రదాయము. సంతోషకరము అయిన విషయము. ఈ సందర్భమున మీరు జందెము వేసికొనుట వేసి కొనకపోవుటలకు పెద్ద ప్రాముఖ్యము లేదు. వేసికొనదలచి నపుడు మిగిలిన వారి అభిప్రాయములకు చెవియొగ్గవలసిన అవసరము లేదు. మీ చెవులు మీరుచ్చరిస్తున్న గాయత్రిని వినుటయందు నిమగ్నము కావలెను. ముమ్మిడివరం బాల

యోగి ఎవరినడగి తపస్సులో కూర్చొనినాడు? మనను మనము దైవమునకు సమర్పించుకొనుటకు సంప్రదింపులతో పనిలేదు. అభిప్రాయములకు తావులేదు.

మరొక కోణము నుండి పరిశీలించినపుడు మరొక సమాధానం మనకు లభించగలదు. యోగి అయినవాడు తోటి వారితో వింతగా ప్రవర్తించకూడదని సహజముగా కలిసిమెలిసి మెలగాలని గీతలో కృష్ణుని ఉపదేశం వేమభావలలో ప్రత్యేకతలూ విశేషాలూ పాటించకుండానే ప్రశాంతంగా మన సాధన మనం చేసుకుంటూపోవచ్చు. తానితరులకన్న వేరుగా కనబడటం కాకుండా తోటివారిలో తానొకడిగా సహజంగా, లలితంగా కలసి జీవించగలడం యోగసాధనకు పరమావధి. దీని ప్రకారం లోకసహజమైన వేమభావలతో మీరు నిశ్చింతగా పూజచేసి కొనవచ్చు.

తేలినదేమంటే మన ఇష్టప్రకారం చేసుకోవడానికి దైవం మనకెపుడూ స్వేచ్ఛ యిచ్చాడని అలాగని మనం లోకంలో వింతగా ప్రవర్తించవలసిన పనిలేదని, ఇంతకూ మీరు చేస్తున్న పూజలోనికి మీరు ప్రవేశిస్తే ఏ గొడవా ఉండదు. ఎగతాళి చేస్తున్న వారిలో నుండి ఆ దైవమే వ్యక్తమవుతున్నాడని మనం తీసుకొన్న నిర్ణయం యొక్క బలాబలాలు ఊపిచూస్తున్నాడని తెలుస్తుంది. మీరు ఉడికితే జనం రూపంలో దేవుడు ఉడికిస్తాడు. ఉడక్కపోతే మన పప్పులు ఉడకడం లేదని క్రమంగా వాళ్ళే మీకు చేతులెత్తి నమస్కరిస్తారు.

ఇంతకు గాయత్రి సమర్పణను కోరుతుంది తప్ప ఏ విధమైనవేషభాషలను ప్రత్యేకించి కోరదు. ఆ వేష భాష లన్ని సాధనకు చిహ్నాలుగా ఉపకరణాలుగా పెద్దలు ఏర్పాటు చేసినవే. కొంతమంది తల్లితండ్రులు తమ పిల్లలు ఉపనయనం కాకముందే గాయత్రి చేస్తున్నారని బాధప డుతున్నవారుఉన్నారు. బిడ్డలను అలా చేయడం నేరమని కేక లేస్తున్న వారున్నారు. తమ బిడ్డలకు చిన్నతనంలోనే ఉపన యనంచేసి గాయత్రి ఉపదేశించ వలసిన తమ బాధ్యత విడిచి, తాముగా ఆపిల్లలు గాయత్రికి దగ్గరైతే బాధపడుతున్న పెద్ద లను గూర్చి జాలిపడడం తప్ప చేయకలిగిందిలేదు. ఉపనయనం అంటే సమీపమునకు చేరుట అని అర్థం.పరాప్రకృతికి తాముగా దగ్గరకు చేరినఆకుర్రవాళ్ళకు జందెంతోనిమిత్తమేమిటి? సన్ని కల్లు దాస్తే పెళ్ళి ఆగుతుందా? మనం ఉపనయనం చేసిజందెం వేయక పోయినంత మాత్రాన ఆకుర్రవాళ్ళు గాయత్రి స్మ రణ మానుతారా?

ఒకప్పుడు పురుషులతో బాటుగా స్త్రీలకు కూడ ఉపన యనాలు జరిగేవి. స్త్రీలు కూడ యజ్ఞోపవీతాలుధరించేవారు. స్త్రీలు గాయత్రి చేయడానికి అనర్హులని ఆధునికంగా ఒక పాషండ అభిప్రాయం ఏర్పడింది, ఈ పాషండత్వాన్ని భేదించి ఇ.కె. గారిలాంటివాళ్ళు స్త్రీలకు బాహాటంగా గాయత్రినుప దేశించి వారిచే వేదాధ్యయనం చేయిస్తున్నారు. వారు ఉపన యనక్రతువు, యజ్ఞోపవితధారణలతో నిమిత్తం లేకుండానే గాయత్రీధ్యానంతోపాటు వేదాధ్యయనం చేస్తున్నారుకదా!

అమ్మవారికి నమస్కరించుకోవడానికి క్రతువు జరిగితీరా లనిలేదు. ఆమెను స్మరించుకోవాలనిపించడం ముఖ్యం. మీకు వేసుకోవాలనిపిస్తే మొహమాటపడకుండా జందాన్ని వేసుకోండి. అక్కర్లేదనిపిస్తే ప్రక్కన బెట్టండి. వేసుకోవాలా అక్కర్లేదా అన్నది నిర్ణయించవలసింది మీరుగాని మీచుట్టూ ఉన్న వారుకాదు. ఇవాళ జందెం వేసుకుంటే నలుగురూ గేలిచేసారని తీసి ప్రక్కన పెడితే రేపెవరో మీరు గాయత్రి చేయడం తప్పని తీరి పెట్టడం మొదలు పెడతారు. మీరప్పుడు గాయత్రిని మానేస్తారా? అందుకే చెప్పాను. ఏది ఉండాలి. ఏది చెయ్యాలి అన్నది నిర్ణయించవలసిందిమీరు గాని, మీచుట్టూ ఉన్నవాళ్ళు కాదని మీరు తీసుకున్న నిర్ణయంఎంతసోత్తైందో చుట్టూ ఉన్న జనం రూపంలో దైవం కుదిపి చూస్తున్నాడు అని గ్రహించండి. అపుడు చుట్టూ ఉన్న వారి మీద మికున్న ఏహ్యాభావం పోతుంది. లేకపోతే చుట్టూ ఉన్నవాళ్ళు మీ సాధనకు అడ్డుపుల్లలు వేస్తున్నారని భ్రమనుపడ మీప్రయాణం నిలిచిపోయే అవకాశం ఉంది. హాసమైనా పరిహాసమైనా పైవాడిదేనని తెలియాలి.

ప్రేమతో

.........

# ఉదరపోషణ పాత్రపోషణ

విశాఖపట్టణం,
17-8-1988.

పూజ్యులు.........గారికి

నమస్కారములతో కృష్ణస్వామి వ్రాయునది. మన సోదరబృందము అందరూ క్షేమంగా ఉత్సాహంగా ఉన్నారని తలుస్తాను. నేను అక్కడి ప్రసంగంలో పాత్రపోషణ అని సూచించినదానికి మన స్నేహితులే ఒక ఉదాహరణ. ఆయనకు వాటికవిగా లభించడానికి సిద్ధపడిన ఏ ఉద్యోగాన్ని చేసుకున్నా కుటుంబం సాఫీగా నడిచిపోయేదికదా. అలా ఏదో ఒకటి చేసుకొని పొట్ట పోసుకోవడం కాకుండా తను చేయగలిగిన దానికి చేయవలసినదానికి అంకితమయ్యారు ఆయన పొట్టపోసుకోవడానికి ఏదో ఒకటి చెసుకోవడాన్ని ఉదరపోషణ అంటారు. తాను చేయగలిగిన దానికి అంకితమవ్వడాన్ని పాత్రపోషణ అంటారు. ఈ రెండు రకాల జీవితాల్ని మన పెద్దలు రెండు పేర్లతో పిలిచారు. ఉదరపోషణ ప్రధానంగా కలవాడుకామోత్తరంగా జీవిస్తున్నాడని, పాత్రపోషణ ప్రధానంగా కలవాడు ధర్మోత్తరంగా జీవిస్తున్నాడని వారన్నారు. మనం పనిచేస్తున్నాం. పని వలన డబ్బులు వస్తున్నాయి. డబ్బుల వలన సుఖభోగాలు అమరుతున్నాయి. ఈ సుఖభోగాలు దేని కొరకు? అని ప్రశ్నించుకొంటే మానవ జన్మకు సార్థకత. సుఖభోగాలు(కామం)అనుభవించాలంటే డబ్బులు(అర్థం)కావాలి. డబ్బులు కావాలంటే పని (స్వధర్మం)చెయ్యాలి. అంటే పని

దేనికోసం చేస్తున్నామన్నమాట. డబ్బులకొరకు వాని వలన వచ్చే సుఖభోగాలు కొరకు. ఇలా జీవించడాన్ని కామోత్తరంగా జీవించడమన్నారు పెద్దలు. దీనికే ఉదరపోషణ జీవితమని నేను పేరు పెట్టాను. అలా గాక ఒకడు పనిచేస్తున్నాడు పని వల్ల అతనికి డబ్బులొస్తున్నాయి. డబ్బుల వలన సుఖభోగాలు అమరుతున్నాయి. ఆ అమరిన సుఖభోగాలతో అతడు మరింత దీక్షతో తన పనిని చేస్తున్నాడు. అంటే ఆపని చేయడమే అతని జీవిత పరమావధి. దాని నుండివచ్చే అర్థకామాలు పనిచేస్తున్న అతనికి సహకరిస్తున్నాయి. దీనినే మనవారు ధర్మోత్తర జీవితమన్నారు. దినికే నేను పాత్రపోషణ అని పేరు పెట్టాను. కామోత్తర జీవితంలో మనిషికి సుఖం లభిస్తుంది. ధర్మోత్తర జీవితంలో మనిషికి తృప్తి లభిస్తుంది. ఆ తృప్తికే మన వారు ముక్తి అని పేరు పెట్టారు. మీరు ప్రేమతో పంపుతున్న "మీవారపత్రిక" అందుతున్నది. నిర్వాహణ తీరుతెన్నులకు మనస్సు తృప్తిననుభవించుచున్నది. ఈ వయస్సులో మీరు నిత్యనూతనంగా దానిని నిర్వహించడంలో మీరనుభవిస్తున్న నిత్యనూతనత్వం ప్రకటితమవుతోంది. ఆరోగ్యవంతుడై నచిన్న పిల్లవాని దగ్గర వ్యక్తమయ్యే ఉత్సాహం, సూటిదనం, మీకృషిలో నాకు కనిపిస్తున్నాయి. ముచ్చట కల్గిస్తున్నాయి.

సజ్జన సాంగత్యము కన్న మానవ జీవితమునకు పరమావధి మరొకటి లేదన్నది నా విశ్వాసం. మీతోటి సాంగత్యం దివ్యానుభూతిని కల్గించు చున్నది. ధన్యుడను.

మీ

.........

# జరిగే జీవితాలు - పెరిగే జీవితాలు

విశాఖపట్టణం
13-4-83

ప్రియసోదరుడు......కు

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది-నీవు హృదయ పూర్వకముగా వ్రాసిన ఉత్తరము అందినది. గత జీవితంలోని సంఘటలన్నీ ఒక్కసారిగా కళ్ళముందు మెదిలాయి. నీకు జీవితమే ఒక పరీక్షగా, సాహసయాత్రగా కొంచెం పైనుండి చూసినపుడు సాధనగా సాగుతూ వచ్చింది. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోవడం నీవు పిల్లలందరిలోను చిన్నవాడివి కావడం అక్కల అక్కరలు తీర్చడానికి అమ్మ నీవు శ్రమపడవలసి రావడం ఆ జీవితాలలో మళ్ళీకొన్ని అపశ్రుతులు, కొన్ని అస్తవ్యస్త సంఘటనలు. కొన్ని భరించరానివి కొన్ని బదులు చెప్పలేనివి. ఈ సంఘటనల కొలిమి నిప్పుల మధ్య నీ జీవితమనే ఇనుపముక్క కాలుతూ సాగుతూ వచ్చింది.

నీవు ఎన్నడూ బాధ్యతలనుండి తప్పుకోలేదు. కర్తవ్య నిర్వహణలో బద్ధకించలేదు. వయస్సు పెద్దది కాకపోయినా నీ అనుభవం చాలా దొడ్డది. వయస్సుకు అతీతమైన అనుభవాలు, ఆలోచనలు ఆశయాలు నీవి.

జీవితాలు రెండురకాలు. కలిసొచ్చే సన్నివేశాలతో కులాసాగా గడిచిపోయేవికొన్ని. కదలించే సన్నివేశాలతో పరీక్షించబడేవి, పట్టి జూడబడేవి కొన్ని. కులాసా జీవితాలలో మనిషికి జరిగేది బాగుంటుంది గాని మనిషి పెరిగేది చాల

తక్కువ. పట్టి చూడబడే జీవితాలలో అడుగడుగునా అగ్ని పరీక్షలున్నా మనిషి వెగుబడల అధికం. నిజానికి పట్టిచూడబడే జీవితాల్లోనే మనిషికి ప్రయోజనం ఎక్కువ.

కర్తవ్య నిర్వహణమే మానవ జీవితానికి పరమావధి. దీనినే గీతలో కృష్ణుడు స్వధర్మ నిర్వహణమన్నాడు. ఆ కర్తవ్య నిర్వహణలో పొరపాటు పడకుండా ఉండాలనే అతని బోధ. మనదృష్టిలో కుటుంబం వేరు, లోకం వేరు దేవునిదృష్టిలో లోకమున్నది. లోకంలో భాగంగా మన కుటుంబమున్నది. కనుక కుటుంబసేవ, లోకసేవ వేరుకాదు కుటుంబాన్ని సేవిస్తూ కుటుంబాన్ని కలుపుకుని తోటి లోకాన్ని సేవించాలన్నది మన పెద్దలు చూపిన మార్గం. కుటుంబాన్ని సేవించలేనివాడు లోకాన్ని సేవిస్తాడనడం పట్టిమాట. అయితే కుటుంబమే లోకంగా ఉండేస్థితినుండి లోకమే మన కుటుంబంగా ఉండే స్థితికి మనం ఎదగవలసిఉంది.

ప్రస్తుతం నీవు పై స్థితికి ఎదిగేటందుకు తగిన వాతావరణం సిద్ధమవుతూఉంది. పరిస్థితులు సర్దుబాటయి సక్రమంగా కథ నడిచిపోగలదు. ఎప్పటికప్పుడు ఏం జరుగుతున్నది ఉత్తరాలు వ్రాస్తూ ఉండు. ఆవశ్యకతను బట్టి తగిన సూచనలు శ్రద్ధతో చేస్తూ ఉంటాను. త్వరలోనే ఆర్థికంగా నీవు ఒక స్థాయికి చేరుకోగలవని, సామాజికంగా మంచి సేవకుడిగా రూపొందగలవని ఆశిస్తున్నాను.

శుభాకాంక్షలతో

..........

# వ్యక్తి అంటే

విశాఖపట్టణం
20-9-64.

పూజ్యసోదరులు.........గారికి

మీరు వ్రాసిన లేఖ అందినది. మీ తోడల్లుడుగారు తన జీవితాన్ని సార్థకంగా, సేవాధర్మపరంగా, సాహసికంగా నడిపినవారు. అలాంటి వ్యక్తికి, ఆవ్యక్తి కుటుంబానికి భగవదనుగ్రహం ఏదో ఒకరూపంలో అందుతూనే ఉంటుంది. ఆ అనుగ్రహం మనలాంటి మానవ శరీరాలను వ్యక్తం కావడానికి ఎంచుకుంటుంది. ఎవరిద్వారా ఎవరికి మంచి జరుగుతోందన్నా సత్యం యిదే. అయితే, ఆ అనుగ్రహాన్ని మననుండి నలుగురూ అందుకొనేటందుకు వీలుగా మనశరీరాన్ని, జీవితాన్ని మనం తీర్చిదిద్దుకోవలసి ఉంది. మానవుడిదృష్టి తనను తాను తీర్చి దిద్దుకోవడంవైపు వర్తిస్తున్నంతకాలం భగవదనుగ్రహం అతడి నుండి యథేచ్ఛగా లోకంవైపు ప్రసరిస్తూ ఉంటుంది. ఫిలమెంటు సరిగా ఉన్నంతకాలం కరెంటు బల్బుద్వారా లైటుగా వ్యక్తమైనట్లు. అయితే మానవుడు ఒక పొరబాటు పడకూడదు. ఆ వెలుగు తనది అనిగాని లేదా తనవల్లనే ఈ లోకం ఉద్ధరింపబడుతోందనిగాని భ్రమపడకూడదు. వెలుగు తనదికాదని తాను వెలుగుకు సంబంధించిన వ్యక్తినని, వ్యక్తి అంటే ఆ వెలుగు యొక్క ఒకానొక వ్యక్తీకరణమేనని, అతడు గ్రహించాలి. ఆ వెలుగు తన వ్యక్తీకరణరూపం ద్వారా తిరిగి వ్యక్తమవుతోందన్నమాట. ఈ సత్యాన్ని గ్రహిస్తే, మానవజన్మ ఎంత దుర్ల

ఖమైనదో, వివేకంతో వినియోగించుకుంటే ఎంతటి విశిష్టమై నదో తెలుస్తుంది.

మీ సోదరులలాంటి పెద్దవారు తాము పొందవలసిన భగవదనుగ్రహాన్ని నా ద్వారా పొందుతున్నపుడు నాకు ఇలాంటి సత్యదర్శనం మరల మరల అందుతూఉంటుంది. నిజానికి అలాంటి సన్నివేశాలకన్నా దైవారాధన ఘట్టాలు వేరే ఉండవు.

ప్రేమతో

... ... ...

## నదులు కవితలు

విశాఖపట్టణము
8-10-84

సోదరులు ......... గారికి.

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది మీకు పంపిన కవితలు వ్రాసిన ఉత్తరం అందాయి. మీ నుండి కవిత ఒక ధారగా దానికదిగా వెలువడుతున్నది. కొండల మీదుగా నదులు దిగివచ్చినట్లు మీ నుండి కవితలు దిగి వస్తున్నాయి. కొండలు నదులకు జన్మస్థలాలే కాని జన్మకారణాలు కావు కదా! కొండలు ఉన్నవి నదులు దిగటకు పనికి వచ్చినట్లుగా

మీ సంస్కారము సాధనామయమైన కవితలు దిగివచ్చుటకు అవకాశం ఇస్తున్నది. మాస్టరుగారు ఒక వయస్సు తరువాత తమ నుండి యోగ మార్గము వ్యక్తము చేసినట్లు మీ నుండి ఇపుడు కవితా ప్రస్థానము ప్రారంభించినారు.

త్వరలో ఈ కవితలు ఒక సంపుటిగా వెలువడాలి.

ప్రేమతో

..........

## ఆ వే శం ఉ త్సా హ ము గా

విశాఖపట్టణం
10-11-1984

ప్రియసోదరుడు ......... కి

ఆశీస్సులు. మన బృందమంతా క్షేమంగా వర్ధిల్లుతూ ఉత్సాహంతో పని చేస్తున్నారని తలుస్తాను. ఉత్సాహంతో అని ఎందుకు అన్నానంటే చాలామంది విషయంలో ఉత్సాహం స్థానంలో ఆవేశం ఉంటుంది. ఆవేశానికి ఉత్సాహానికి మిణుగురు పురుగుకు సూర్యునకు ఉన్నంత తేడా ఉంది. ఆవేశంతో చేసేవాళ్ళు ఆగిపోయే ప్రమాదముంది. ఉత్సాహం అలాగాక సాగిపోయేటట్లుగా చూస్తూ ఉంటుంది. ఆవేశం ఉత్సాహంగా రూపొందేటందుకే మనం చేసే సాధన అంతా. మన కుర్రాడొకడు అలాంటి ఆవేశంతోటే రంగంలోనికి దిగే బదులు దూకాడు. ముందు వెనుక చూసుకోకుండా దూక

డంతో ఆ ముందు వెనుకలు అతనికి అనుకూలించలేదు. అతని వాళ్ళు ప్రయత్నం కొనసాగకుండా కాళ్ళు అడ్డం పెట్టారు. తప్పు వాళ్ళది కాదు, మనవాడిదే. వాళ్ళతో సరైన అవగాహన పెంపొందించుకోకుండగానే తన వెంట వాళ్ళు దూకుతారని అనుకుని ఇతడు దూకేశాడు. వాళ్ళు దూకమన్నారు. ఇతడు పిచ్చిమొహం పెట్టాడు. ఏం చెయ్యమంటారు అన్నాడా కుర్రాడు. నేను చేయగలిగేది ఏముంది. ఏది ఏమైనా మీరందరూ కలిపి నడచుకోవడం నేర్చుకోండి అని చెప్పాను. మేకప్పు పూర్తి కాకుండానే స్టేజిమీదకు నటులు వచ్చేస్తే ఏం జరుగుతుంది? ఈలలు, గోలలు. ఆ నటుడు సిగ్గెసి తెరలో దూరాడు. ఇక ఈలలు, గోలలు భరించవలసింది మనం. తగుదునమ్మా అని నాటకం పెట్టాక తప్పుతుందా! అంతా మాస్టరుగారి సంకల్పం అందుకనే మన కుర్రాళ్ళు ఆవేశంతో కాక ఉత్సాహంతో పని చేస్తున్నారు కదా అని వ్రాసాను. సన్నివేశాలను సక్రమంగా చూడగలగడం చేతనయిన కొద్దీ సందేశాలు అందుతూ ఉంటాయి. ఫలాపేక్ష ఉంటే ఈ సందర్భాలలో నిరుత్సాహం వస్తుంది. నిరుత్సాహం చెందినవాడు సంయమాన్ని కోల్పోతాడు తప్ప సన్నివేశాల నుండి సందేశాలను అందుకోలేడు. ఇక్కడి కార్యక్రమాలన్నీ యథావిధిగా జరుగుతున్నాయి.

ఆశీస్సులతో

..........

# కథ దారిని పడుతుందని

విశాఖపట్టణం
5-1-1985

చి॥ వి ......... కు ఆశీస్సులు.

నీవు వ్రాసిన ఉత్తరం అందినది. "మాస్టరుగారి పుస్తకాలు మళ్ళీ మళ్ళీ చదువుతున్నాను. "అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తున్నాను" అని వ్రాసావు. ప్రయత్నం మంచిదే, ఎప్పుడూ చేయవలసిందే, కాని ఇలాంటి దివ్యగ్రంథాలను మనం అర్థం చేసుకోవడం ఉండదు. మనకు అవి అర్థం కావడం ఉంటుంది. మనం శ్రద్ధపెట్టి చదువుతున్నప్పుడు మనకు తెలియకుండానే మన మనస్సును తలుపులు తెరచి తమలోనికి ఆహ్వానిస్తాయి ఆ దివ్య గ్రంథాలు. వాటిలోనికి ప్రవేశించిన మనస్సు ఒక్కొక్కప్పుడు కరిగిపోతూ ఉంటుంది. అపుడు మనం పారవశ్యం అంటాం. ఒక్కొక్కప్పుడు వికసిస్తూ ఉంటుంది. ఆ వికాసమే మన పెద్దల చేత జ్ఞానమని పిలువబడింది. ఎప్పటికప్పుడు ఈ వికాసం విస్తృతి చెందుతూ ఉండడంతో చదివినప్పుడల్లా ఆ గ్రంథాలు నూతనంగానే భాసిస్తుంటాయి. అంటే నూతనంగా మరికొంత వికాసం మనకు లభించిందన్నమాట కనుకనే మన పెద్దలు ఇలాంటి గ్రంథాలను నిత్యమూ పారాయణ చెయ్యాలి అన్నారు. అంటే కథ మనకు తెలియదని కాదు. అలాచేయడం ద్వారా మన కథదారిని పడుతుందని.

ఆశీస్సులతో

.........,

# వేదన కాదది సాధన

విశాఖపట్టణం
23. 3. 85.

చి॥సౌ॥.........కి ఆశీస్సులు

నీవు వ్రాసిన ఉత్తరము అందింది.

జీవితంలో అలసిపోయి ఉన్నావు. దిగాలు పడకు దిగాలు పడితే మరింత నీరసమైపోతావు. ఆ నీరసంలో కర్తవ్యం అంతు పట్టదు, కనుక నీరసాన్ని ఆశ్రయించవద్దు. మాస్టరు గారి స్మరణలో ధైర్యంగా ఉండు. చేయవలసిన పని నేర్పరితనంతో చెయ్యి. జీవితంలో కూడదీసుకోవడం చేతకావాలి. దిగాలుపడినప్పుడు ఏసన్ని వేశం మనకు వేదనగా అనుభవానికి వస్తుందో ధైర్యంగా ఉన్నప్పుడు ఆ సన్ని వేశమే మనకు సాధనగా అక్కరకు వస్తుంది. "సన్ని వేశాలన్నీ సాధనలో నిభాగాలే"

ఎప్పటి కప్పుడు ఉత్తరాలు వ్రాస్తూండు. నేను కర్తవ్యాన్ని సూచిస్తూ ఉంటాను. నీ మనస్సుకు చెదరని ప్రశాంతిలో నిలవడం అలవడాలని మాస్టరుగారిని కోరుతూ ఇప్పటికి సెలవు తీసుకుంటున్నాను. మీ శ్రీవారిని, మనవారందరిని అడిగినట్లు చెప్పవలసింది.

ఆశీస్సులతో

...............

# ఆలోచన నుండి ప్రణాళికకు

విశాఖపట్టణం
23-3-1985.

చి॥సౌ॥.........కు ఆశీస్సులు.

నీవు వ్రాసిన ఉత్తరం, పంపిన ఉగాది శుభాకాంతులు అందుకున్నాను. నీవు కలవర పడవలసిన పనిలేదు. జరగవలసిన వాటికి అడ్డం పడడం పెద్దవాళ్ళు చేయవలసిన పనికాదు. ఏది ఏమైనా నీవు నీ నిర్ణయానికి కట్టుబడిఉండు. అతను కూడా ఈ నిర్ణయానికి సంతోషించి కలసి ఏస్తాడనివిశ్వ సిస్తున్నాను. నాన్నగారు కొంచెం పూను కోవలసి ఉంది.

నీవు అదే పనిగా ఆలోచించి మనస్సుపాడుచేసుకోవద్దు. ఏమి చేస్తే పని సానుకూలమౌతుందో అది చెయ్యాలి. అదేప నిగా ఆలోచిస్తే బుర్రవేడెక్కుతుంది. పని సానుకూలం కావడా నికి అడ్డంకులు పెరుగుతాయి. అలాకాక, మనస్సును ప్రశాం తంగా ఉంచుకుని, మనం నమ్మిన దైవాన్ని స్మరించుకోవాలి. ఆలోచనలు తగ్గితే అడ్డంకులు తగ్గుతాయి ఆలోచన తగ్గిపోయి ప్రణాళిక రూపు దిద్దుకునేసరికి ఇక అడ్డంకులు వుండవు. కనుక ఇప్పుడు కావలసింది ఆలోచన కాదు "ప్రణాళిక" ఈ ప్రణాళిక ప్రకారం నువ్వు పనిచేయడం ప్రారంభించు. నీకు కావలసిన ప్రణాళిక నానుండి ఎప్పటికప్పుడు నీకు అందుతూనే వుంటుంది. నీ విశ్వాసమే నిన్ను రక్షించ గలదు.

ఆశీస్సులతో

..............

# పనులు తొందర పెడుతున్నాయా?

విశాఖపట్టణం
26-3-82

చి॥.........కి ఆశీస్సులు.

నీవు వ్రాసిన ఉత్తరము అందినది.

సామాన్యంగా మానవుడు ఒక పని తర్వాత మరొక పనిచేసుకుందామనుకుంటూ ఉంటాడు. ఏ పని తనను తొందర పెడుతూఉంటుందో దానికి లొంగి దానిని చేస్తూ ఉంటాడు. ఇంతలో తొందర పెట్టనిదే మనం చేయమని తెలిసి మరొక పని తొందర పెడుతూ ఉంటుంది. అప్పుడు దానికి లొంగి పని చేయ వల్సివస్తుంది. ఇలా చేస్తూపోతే, ఎప్పుడూ పనులు తొందర పెడు తూనే ఉంటాయి. జీవితానికి కావల్సినతీరు అలవడదు. తొందర పనులుచేయడం కాకుండా, పనులు మనలను తొందర పెట్టడం కాకుండాపనుల్ని మనం తొందరగా చేయాలి. కావల్సినపనులన్నిటికీ తగిన ప్రాధాన్యం ఈయబడాలి. ఒకపని వలన మరొకపని దెబ్బతినరాదు. ఒకపనికి మరొకపని అడ్డుగా గోచరించకూడదు. ప్రతిపనికీ దాని స్థానం, దాని సమయం దిన చర్యలో మనం కేటాయించగలగాలి. అన్ని పనులూ ఏకకా లంలో తగిన రీతిలో ఆచరించడం జరగాలి. శ్రీ కృష్ణుడు హస్తినలో ఉంటూ ద్వారకకు కావల్సిన పనులు కూడ చేసే వాడు. ద్వారకలో ఉన్నప్పుడు హస్తినలో తన పనులను కని పెట్టి తానుగా నిర్వహించేవాడు. అతడెక్కడ ఉన్నా అందరి వాడనీ అందరినీ ఏక కాలంలో రక్షించుకోగలడనీ అందరూ

క్షైర్యంగా ఉండేవాడు. ఏక కాలంలో అన్ని పనులూ చూచుకోవడం అంటే ఏమిటో శ్రీకృష్ణుడి జీవితంలో మనం ప్రవేశించి నేర్చుకోవాలి. జైల్లో పుడుతూనే వ్రజగోకులంలో తగిన ఏర్పాటు చేసికొని పుట్టి, తల్లి చనుబాలు ఒక్కసారిమాత్రమే త్రాగి, తండ్రికి కర్తవ్యాన్ని నిర్దేశించాడు. అలా ప్రారంభించిన తన జీవితం ఎవరికీ అందని, ఎవరూ కందని ఒక మహాయజ్ఞంలా సాగి, చివరకుశరీరాన్ని వదిలిపెట్టబోయేముందునశించబోయే వారికోసం వనవిహార సంకల్పాన్ని, బ్రతికి ఉండవలసిన వారికోసం అర్జునునకు ఆహ్వానాన్ని అందించి ముందుకు సాగిపోవడం దాకా నడచింది. చివరకు బ్రతికి ఉండవలసిన వాళ్ళని రక్షించవలసిన బాధ్యత కళ్ళముందు మెదలడంతో కృష్ణుడువిడచిన దేహానికి అర్జునుడొక్కడే అంత్యక్రియలు జరుపుతాడు. చివరకి అంత్యక్రియలవిషయంలో కూడా కర్తవ్యాన్ని బోధించి నిలబెట్టాడు అర్జునుణ్ని. కృష్ణుడు "జైల్లో ఏకాకిగాపుట్టాడు. అరణ్యంలో ఏకాకిగా శరీరాన్ని విడిచాడు". పుట్టుక, చావులకు కూడ కర్తవ్యాన్నే ముడి పెట్టుకుని, చేయవలసింది సమగ్రంగా చేశాడతను. చేయగలిగింది చేయడానికి కూడా తికమకపడి పోతుంటాం మనం.

ఆశీస్సులతో

... ... ...

# సాంగత్యం నుండి సాన్నిధ్యానికి

విశాఖపట్టణం
24-3-౮5

చి॥సౌ॥.........కి ఆశీస్సులు.

నీవు వ్రాసిన ఉత్తరము అందినది. మనం మాట్లాడుకోవ డానికి ఉత్తరాలు ఉన్నాయి. మాటలాడటానికి సాధ్యంకాని భావాలను అందుకోవడానికి మన హృదయాలు ఉన్నాయి. ఈ పద్ధతిలో నడుస్తున్న కొద్దీ సాంగత్యం సాన్నిధ్యంగా రూపొందుతుంది. సాంగత్య మంటే భౌతికంగా కూడా కలిసి ఉండడం. సాన్నిధ్యమంటే మానసికంగా కలసి వుంచడం. సాన్నిధ్యాన్ని అనుభవించడం అనే గమ్యానికి మనను నడి పించేదే సాంగత్యం. మనుషులు కలసి ఉండడంలో కన్నా మనసులు కలసి ఉండడంలో మరింత దివ్యానుభూతి ఉంది. మనస్సులు కలసి ఉండడంలో కన్నా హృదయాలు కలసి ఉండ డంలో తరుగని దివ్యవైభవం జీవితంగా వ్యక్తమౌతుంది. మెల్లమెల్లగా మనం ఆ హృదయానుభూతికి చేరవలసి ఉంది. మధ్యమధ్యలో మనం కలుస్తూ ఉండడం ఆ ప్రయాణానికి మరింత వేగం పెరగడానికి పనికివస్తూ ఉంటుంది.

నేను లేనని మీరు అనుకోకూడదు. నేను మీలో ఉన్న ట్లుగా మీరుగా ఉన్నట్లుగా మీ తోటి వారికి స్పష్టం కావాలి. అంటే మీ దగ్గర నా సాన్నిధ్యాన్ని వారు పొందాలి. ఇదే నాకు మాస్టరుగారు నేర్పిన విద్య మళ్ళీ మీకు నేను ఆ విద్యనే నేర్పుకుంటున్నాను.

శుభాశీస్సులతో

పా-10)

# పాటు - పోటీ

విశాఖపట్టణం.
25-3-65

చి॥సౌ॥..........కు ఆశీస్సులు.

నీవు హృదయముతో వ్రాసి అందించిన ఉత్తరాన్ని ప్రశాంతంగా చదువుకున్నాను. ఈ ఉత్తరంలో నీ ఆర్తి, పవిత్రత, సమగ్రబుద్ధి నిండి ఉన్నాయి. మనిషి సంస్కారం వాక్కు ద్వారా వ్యక్తమౌతూంటుంది. అలాగే, ఈ ఉత్తరంలో నీ వాక్కులు నీ దివ్యసంస్కారాన్ని చవి చూపిస్తున్నాయి.

మీ ఊరు రావడం, అక్కడ మీ అందరితో కలసి గడపడం, మీకు ఎంత ఆనందాన్ని కలిగించిందో, నాకూ అంత ఆనందాన్ని కలిగించింది. కొన్ని కొన్ని సన్నివేశాలు లీలగా రూపు కట్టుకుంటాయి. అనుభూతి ప్రదంగా నడుస్తాయి. దివ్య స్మృతులుగా మన హృదయాల్లో నిలచిపోతాయి. ఆ ఏడు రోజులూ మనం మనలో లేము. మనందరం కలసి వేరే లోకాలలో వెలుగుల మధ్య నడచాము. అవి వెలుగుల లోకాలు. అక్కడనుండి మనద్వారా ఈ భూమి పైకి తాము దిగి రాదలచినప్పుడు ఆ వెలుగులుదిగి వస్తూ ఉంటాయి. ఒక్కసారి లభించిన ఆ ప్రవేశం, జరిగిన ఆ విహారం జన్మజన్మలకూ మనపై ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటాయి. మనకు కావలసిన ప్రణాళికలను అందిస్తూనే ఉంటాయి.

మీ ఊరిలో గడిపిన ఆ రోజులలో నాకు ఒక చిత్రమైన అనుభూతికలిగింది. అనేక జన్మలుగా నాతో నడచి వస్తున్నవారు ఈ జన్మలో అక్కడక్కడ పుట్టి పెరుగుతూ, మళ్ళీనాతో కలసి ప్రయాణం చెయ్యడం కోసం అక్కడకుచేరి చేయి పట్టుకున్నట్లనిపించింది. మీరెవరూ నాకు క్రొత్తగా కనిపించలేదు. చేరవలసిన వాళ్ళ దగ్గరకు చేరినట్లనిపించింది తప్ప, కొత్తవాళ్ళను పరిచయం చేసుకున్నట్లు అనుకుందామన్నా అనిపించలేదు. మన ప్రయాణంలో ఇలా జరగడం సర్వ సామాన్యమైన విషయం.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే ఇంతపెద్ద సంఖ్యలో ఒక్కసారిగా చేరవలసినవారు చేరుతూ వచ్చారంటే జీవిత ప్రయాణం ఒక పెద్ద మలుపు తిరుగుతున్నదని నా కనిపించింది. నిజానికి అదే జరిగింది. బాధ్యతలు పెరిగేయి. శక్తియుక్తులు అనుగ్రహించబడ్డాయి. ఆత్మ సంతృప్తి పెరిగింది. ఆత్మీయుల సంఖ్య రోజురోజుకీ పెరుగుతోంది. జాతి పునర్నిర్మాణానికి మీ ఊరిలో వెలువడిన శంఖారావం ఇక ద్విగుణీకృతమై కొనసాగుతూనే ఉంటుంది. గమ్యం చేరేవరకూ అది విశ్రమించదు. అసలు విశ్రాంతినే కోరదు. పనిచేయడంలో విశ్రాంతి దొరుకుతుంది తప్ప పనిని ఆపడంవల్ల విశ్రాంతి దొరకదు. గానం చేస్తున్న వ్యక్తి గానం సాగుతున్నప్పుడు పొందిన ఆనందం గానాన్ని నిలిపినప్పుడు పొందగలడా? విశ్రాంతి కూడా అలాంటిదే. పనిచేయడం చేతనైనవాడు పనిలో ట్రైన్ (train) అవుతూంటాడు. పనిచేయడం చేత కానివాడు స్ట్రెయిన్ (strain) ఫీలవుతూ ఉంటాడు. ఈ రహస్యం తెలిస్తే మనం నిరంతరం

పనిలోనే ఉంటాం. ఇప్పుడు మనందరం గుర్తుంచుకోవలసిన సూక్ష్మాంశం ఇదే. ఇది గుర్తుంటే మన ప్రయాణం పాటగా సాగుతుంది. లేకపోతే "పాటు"గా మిగిలిపోతుంది. "జీవితాన్ని పాటగా పాడదామా? పాటుగా పడదామా?" చూశావా?? పాటకీ పాటుకీ ఎంత తేడా ఉందో! కొమ్ము వచ్చేటప్పటికి అర్థం మారిపోయింది. అలాగే పనిచేసుకుంటున్న మనసుకి కొమ్ములొస్తే జీవితానికే అర్థం మారిపోతుంది.

తరుచు ఉత్తరాలు వ్రాస్తూ ఉండవలసింది. మనస్సు తెలిపి, అంతటితో ఊరుకోకుండా, మనస్సును తలచి మీ లాంటి వాళ్ళు తరచు వ్రాస్తుండే ఉత్తరాలు సాగుతున్న ప్రయాణాన్ని దీప్తిమంతం చేస్తుంటాయి. మీరు నా హృదయంలోనే ఉన్నారు. కనుకనే మిగిలిన లోకానికి నా హృదయం మీరుగా, మీ జీవితాలుగా వ్యక్తమౌతూ ఉంటుంది. మీ జీవితాలను తడిమి చూసిన వారికి ఇకపైన నా హృదయపు లోతులు తెలుస్తాయి. ఏసుప్రభువు చెప్పిన ఈశ్వర సామ్రాజ్యం, పరలోక రాజ్యం అంటే ఇదే.

నానుండి ఫలితాన్ని అపేక్షించకుండా మీరు మాత్రం ఉత్తరాలు వ్రాస్తూండండి. ఈ రూపంలో మీకు నిష్కామ కర్మ చెయ్యడం అలవాటౌతుందన్నమాట. మీ శ్రీవారిని అడిగినట్లు చెప్పగలవు. ఈసారి అందరం కలుద్దాం.

ప్రేమతో

..........

# ఏది దగ్గర? ఏది దూరం?

విశాఖపట్టణం
3.4.1965

చి॥సౌ॥.........ఆశీస్సులు.

నీవు వ్రాపిన ఉత్తరాలు అందాయి. నీ ఆర్తి నాకుబోధ పడింది. నీకు కావలసిన సమాధానం తప్పక దొరుకుతుంది. ఆ ఊరిలో మనం కలుసుకోవడంతోనే అది దొరకడం ప్రారంభించింది. మన కలయిక నీ జీవితానికి ఒక చక్కని మలుపు. క్రమంగా ఆవేశం ఆచరణగా రూపొందుతుంది. అఖిలాను ఆత్మార్పణగా పర్యవసిస్తుంది. నీ జీవితం సేవామార్గాన్ని ధరించి సార్థకమౌతుంది. నీవు కన్న కలలు ఇలలో నిజమౌతాయి.

నీవు తరచుగా ఉత్తరాలు వ్రాస్తూఉంటు. నానుండి ఎప్పటికప్పుడు లేఖలు అందుతూంటాయి. నీ ఆలోచనలకు కావలసిన సమన్వయంనా లేఖలు నీకందిస్తాయి. కావలసినవన్నీ నీదగ్గరే ఉన్నాయి. అయితే మరి కావసిందేమిటి? వాటిని జీవితానికి ఎలా అన్వయించుకోవాలో ఆ సమన్వయంనీకు కావాలి. అది నాద్వారా నీకు తప్పక అందుతుంది.నా గ్రంథాలు అన్నీ నీ దగ్గర ఉన్నాయను కుంటాను. నేను వ్రాసినవి మాస్టరుగారు వ్రాసినవి నీవు చదవగలిగినట్లయితే ఆ గ్రంథాల ద్వారా నీ జీవితానికి కావలసిన సమన్వయం చాలా వరకు దొరుకుతుంది. నీ సంశయాలు చాలా వరకు తీరిపోతాయి. సమాధానం ముడి పడితే సందేహాంగా రూపు దాలుస్తుందిట అని పెద్దలొకరు

చెప్పారు. ఆ ముడిని విడదీయడమే గురువు చేసేది. ముడివిడివడితే అక్కడ ఉన్నది సమాధానమే కనుక నీ మనస్సులో ఉన్న సందేహాల ముడులు ఒక్కొక్కటిగా కాలక్రమంలో విడిపోగలవు. నీవు భౌతికంగా నాకు దూరంగా ఉన్నా మానసికంగా నాకు దగ్గరగానే వున్నావు. నీ మనస్సు నా వాక్కుల గురించే ఆలోచిస్తోంది కదా. చాలా మంది భౌతికంగా దగ్గర వుంటారు. కాని మానసికంగా ఇంకెక్కడో ఉంటారు, దేవాలయంలో దేవుడి దగ్గర కూర్చుని ఏవేవో ఆలోచించుకొనే వాళ్ళులేరూ! వాళ్ళక్కడ కూర్చున్నంత మాత్రం చేత దేవుడికి దగ్గరగా వున్నట్లౌతుందా?

ప్రేయరులో ప్రస్తుతానికి నీవు చేస్తున్నది చాలు. ఆ ప్రేయరు నీ జీవితానికి కావలసిన మార్గాన్ని ఎప్పటికప్పుడు సుగమం చెయ్యగలదు. ఆ ప్రేయరే మనను మానసికంగా కలిపి ఉంచి మనందరిద్వారా ఒకే ప్రణాళికను వ్యక్తం చేస్తూ ఉంటుంది. ఆ ప్రణాళికలో మనందరం పాత్రధారులం. పాత్రధారణకు కావలసిన అంశాలు ఎప్పటి కప్పుడు మనకు తట్టేటట్టుగా ప్రేయరు చేస్తున్నాం. ప్రేయరులో మనమేం చేస్తున్నాం? గురుమూర్తిని స్మరించుకొని గాయత్రిని గానంచేస్తున్నాం గాయత్రిగానంలో మనం చేస్తున్న ధ్యానం ఏమిటి? "మామా బుద్ధులను ప్రేరేపించుచున్న దెవరో ఆ వెలుగునకు నమస్కరిస్తున్నాను.

ఆ వెలుగును వరించు చున్నాను. అని. కనుకనే మన బుద్ధులకు ఏదివ్యశక్తి ప్రచోదనం కలిగిస్తున్నదో ఆ శక్తిని మనం మనసావరిస్తున్నాం కనుక మన పాత్రధారణకు కావలసిన

అంశాలను ఎప్పటి కప్పుడు ఆ శక్తే మనకు అనుగ్రహిస్తూ ఉటుంది. మనం కలుసుకోవడం మనకు శ్రుతి కుదరడం మనలో ఒకరినుండి ఒకరికి వెలుగు ప్రసరించడం మొదలైనవన్నీ ఆశక్తి అనుగ్రహంలోని భాగాలే.

తరచు ఉత్తరాలు వ్రాస్తుండు. నీ మనస్సుకు ప్రశాంతి లభించుగాక! ప్రశాంతత పొందిన నీ మనస్సనే కోనేటిలో గాయత్రి మనకందిస్తున్న ప్రణాళిక ప్రతిబించింది. ఆ దివ్య దర్శనము నీకు భించుగాక.

ఆశీస్సులతో

............

విశాఖపట్టణం,
8-4-85.

## ప్రార్థన ఆంగ్లంలో ఎందుకు సంధ్యా వందనం చేయుడమెందుకు?

చిరంజీవి... ...ఆశీస్సులు.

నీవు వ్రాసిన ఉత్తరం అందింది.

మంత్రానికి ధ్వని ముఖ్యం. ఏ భాష అన్నది ముఖ్యం. అంతే కాక, ఒకప్పుడు సంస్కృతభాష ప్రపంచంలో ఎలాంటి దివ్యస్థితిని సంతరించుకుందో ఇప్పుడు అంగ్లభాషకు అలాంటి దివ్యస్థితిని సంతరింపచేసే ప్రయత్నాలు పెద్దలవల్ల జరుగుతు

స్తాయి. ప్రపంచభాషగా ప్రస్తుతం ఆంగ్లం చలామణీ కాగల గడం వెనుక దాగివున్న రహస్యమిదే. కనుక ఆంగ్లభాషను మనం వినియోగించుకోవడంలో దోషం ఏమీలేదు. భాష అనేది భావాన్ని ప్రసారం చేయడానికి ఏర్పడే ఒక వాహిక. మన సంస్కృతం, మన సంస్కృతి లోకం మొత్తానికి వెలుగు చూపిస్తుందనీ, కనుక మొహమాటపడకుండా స్వీకరించమనీ, ప్రపంచ దేశాలకు మన పెద్దలు ఎలుగెత్తి చాటుతున్నారు కదా! అలాగే నవీనయుగ భాషగా పరిగణించబడుతున్న ఆంగ్లభాషను వాహికంగా తీసుకోవడానికి మనం కూడా మొగమాటపడరాదు.

ఇక రెండవ సందేహం: సంధ్యావందనాన్ని గూర్చి, సూర్యుని వల్ల మనం చూస్తున్న ఈ లోకాలన్నీ రూపుదిద్దబడుతూ వర్ధిల్లుతున్నాయి. నిజానికి మనకి ప్రత్యక్షదైవం సూర్యుడే. సూర్యుడు ఉదయిస్తున్నపుడు అతనికి నమస్కరించడం సంధ్యావందనం అనే క్రతువుగా ఏర్పడింది. ఉదయించే సమయంలోనూ, మధ్యాహ్న సమయంలోనూ, అస్తమించే సమయంలోనూ అతనికి నమస్కరించడం త్రికాల సంధ్యావందనంగా చెప్పబడింది. సూర్యుడు కర్మసాక్షిగా వర్ణించబడ్డాడు. మనం చేస్తున్న విధినిర్వహణ అంతా అతని అనుమతిపైన, అతని ఆధ్వర్యంలో అని గుర్తుంచేటందుకే ఈ సంధ్యావందనం, ఆఫీసులో పనిచేసే ఉద్యోగితాను ప్రవేశించినపుడూ మళ్ళీ సాయంత్రం నిష్క్రమిస్తునపుడూ ఆఫీసరుకు నమస్కారం

చేస్తున్నాడుగదా! అదీ ఒకరకంగా సంధ్యావందనమే. ఈ సృష్టి అనేకార్యానికి కేంద్రం సూర్యుడు. అతనికి నమస్కరించి కర్తవ్యంలోకి ప్రవేశించడం, అతనికి నమస్కరించి ఆరోజుకి కర్తవ్యాన్ని ముగించడం సబబే. సూర్యునిలోను, తనలోను ఉన్నది ఒకే అంతర్యామి అని తెలిసి ప్రవర్తించేటందుకే సంధ్యావందనం. ఇద్దరిలోనూ ఇద్దరుగాఉన్నది ఒక్కడే ఇందరిలోనూ ఇందరుగానూ ఉన్నది ఆ ఒక్కడే అని తెలిసి ఆ వివేకంతో వెలుగుల లోకాలలో జీవించడంకొరకే సంధ్యావందనం. కంటికి సూర్యుని వెలుగు ఎలా కనిపిస్తోందో, సంధ్యావందనం హృదయపూర్వకంగా చేసేవ్యక్తికి మనస్సుకు కావలసిన వెలుగుకూడ అలాగే లభిస్తుంది. ఆ వెలుగునే పెద్దలు వివేకమని పిలిచారు. ఆ వెలుగులో పయనిస్తున్న మనసుకు ఏదికర్తవ్యమో, ఏది కాదో, ఏది నిత్యమో, ఏది అనిత్యమో బోధపడుతుంది. లోకమంతా ఏకమని అనగా ఆ వెలుగేనని తెలిసినవాడు లోకమంతా సుఖంగా ఉండాలని కోరుకోడూ!

అందుకే మన పెద్దలు నిత్యమూ లోకసుఖాన్ని కోరారు. "లోకాస్సమస్తా సుఖినోభవన్తు" మనకు కనబడిన లోకాలూ, కనబడని లోకాలూ కూడా సుఖంగా ఉండాలని కోరుకున్నారువారు. సంధ్యావందనం అలాకోరుకునే హృదయవైశాల్యాన్ని అందిస్తుంది. లోకాన్ని నిద్రలేపుతున్న సూర్యుడికి మనం నమస్కరిస్తే లోకం ఎడల మనం పోతున్న నిద్ర నుండి కూడా అతడు మనల్ని మేలు కొలుపుతాడు. అప్పుడు సూర్యుడు తనకు హృదయంగా పనిచేస్తున్న అంతర్యామి

దర్శనాన్ని అనుగ్రహిస్తాడు. ఆ దర్శనంలో అంతర్యామి నుండి మేలుకొంటున్న కోట్లాది సూర్యుళ్ళు దర్శనమిస్తారు. ఆ దర్శనాన్ని అనుగ్రహించడానికే మన పెద్దలు ఆదిత్య హృదయాన్ని అనుగ్రహించారు. ఆదిత్యునికి హృదయంగా ఉన్న అంతర్యామిని దర్శింపజేసే దివ్యస్తోత్రమది.

అగస్త్యుడు శ్రీరామచంద్రునికి ఈ స్తోత్రాన్ని మొదటగా అనుగ్రహించాడు. ఆ అనుగ్రహంతో యుద్ధంలో అలసిసొలసిన శ్రీరామచంద్రునికి తన నిజ స్వరూపం ద్యోతకమైంది. దాన్ని హృదయంతో చదివితే మనకూ అలాగే ద్యోతకమౌతుంది.

ఆశీస్సులతో

............

## తత్త్వ దర్శనం అంటే

విశాఖపట్టణం

12-4-85

చి॥ సౌ॥ ...... కు ఆశీస్సులు.

నీవు హృదయంతో వ్రాసిన లేఖ అందుకున్నాను. దేహానికి ఆహారం ఎలా అవసరమో మనస్సునకు ఆత్మీయుల వాక్కులు అలా అవసరం. పనిచేసి అలసిన శరీరం ఆహారాన్నీ పానీయాన్నీ స్వీకరించి ఉత్తేజంతో మళ్ళీ ముందుకు సాగినట్లే, పనిచేసి అలసిన మనస్సు ఆత్మీయుల సాహచర్యాన్నీ సందేశాన్నీ అందుకుని నిత్యనూతనమైన తీరులో మళ్ళీ ముందుకు సాగుతూంటుంది. నా ఉత్తరాలు మీకు ఎలాంటివో మీ ఉత్తరాలు నాకూ అలాంటివే.

ఒక్కొక్కరి ఉత్తరం చదువుతున్నపుడు ప్రకృతి మాత తన హృదయ కవాటాన్ని తెరచి లోలోపలి కోణాలలో ఒక్కొక్కకోణం దర్శింపచేస్తున్నట్లు ఉంటుంది. అప్పుడు కలిగే అనుభూతి అనిర్వచనీయం. అప్పుడు ఏదో చూడవలసింది చూసినట్లు, తెలియవలసింది తెలిసినట్లు, పొందవలసింది పొందినట్లు అనుభూతి కలుగుతుంది. ఆ అనుభూతి మళ్ళీమళ్ళీ పొందటానికే మానవుడు ఇన్ని శరీరాలు ధరిస్తూ వస్తున్నాడేమో నిజానికి తత్త్వదర్శనం అన్న మాటకు కూడా అర్థం యిదే. తత్త్వం అంటే స్వభావం. ప్రకృతి తన స్వభావం మనకు తెలియచెప్పినపుడు తత్వదర్శనం పొందిన వాళ్ళమౌతున్నాం. అయితే, ఆ తత్వదర్శనం ఇంత అనుభూతి ప్రదంగా ఉంటుందని, వ్యక్తి నుండి వ్యక్తికి అందుతూ ఉంటుందని పొందిన వాళ్ళకు తప్ప బోధపడదు. ఇంకా పొందనివాళ్ళు ఆపొందిన వాళ్ళు ప్రకటించిన తృప్తిని ఏకరువు పెడుతూ దాన్ని పొందని కరువును అనుభవిస్తూనే ఉంటారు. ఆ ఏకరువు పెడుతున్న కాలంలో తత్వదర్శనం అంటే అతనికి ఏవేవో ఊహాలూ, అభిప్రాయాలూ కలుగుతూంటాయి. వాటినే తన నమ్మకాలుగా, సిద్ధాంతాలుగా ప్రకటిస్తూంటాడు. ఈ ప్రయత్నం ఇలా సాగుతూండగా ఎప్పటికో అతనిని ప్రకృతి అనుగ్రహిస్తుంది. తన తత్త్వాన్ని తెలియ జెప్పుతుంది. ఆ దర్శనంలో ఇన్నాళ్ళ తన నమ్మకాలూ, అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ అన్నీ యిమిడిపోతాయి. అన్నీ కరిగిపోతాయి. ఎడతెగని అనుభూతి ఒక్కటే మిగిలి నిరంతరం కొనసాగుతూంటుంది. ఈ అనుభూతి అందించేటందుకే ప్రకృతిలో గురుశిష్య

సంబంధం. ఈ గురుశిష్యసంబంధం మానవునకు ప్రకృతి అను గ్రహించిన వరం. మనిషికి మనిషిద్వారా సమస్త సృష్టికథను దర్శింపచేయడమే గురు శిష్యుల సాహచర్యానికి లక్ష్యం. ఆ సృష్టి కథను దర్శించి అందులో తన వంతు పాత్రను శ్రద్ధతో నిర్వహించడమే శిష్యుని జీవితానికి పరమావధి. ఆ నిర్వహణలో లభించే దివ్యానుభూతి కొఱకే ఇంత సృష్టి, ఇంతకథా శ్రద్ధతో వంటచేసినవాడు ఆ వంటయొక్క రుచిని అనుభవించ గలుగుతాడు. ఆ రుచి ఆ వంటకు పరమావధి. ఎంత విలువైన పదార్థాలు వాడినా అనుకున్న రుచిరానపుడు ఆ వంట మనకు తృప్తినివ్వదు. వంటకు రుచి ఎలా పరమావధో జీవితమునకు అనుభూతి అలా పరమావది, విలువైన వస్తువులు వాడినా రుచి లభించని వంటాలా అన్నీ ఉన్నా జీవితంలో అనుభూతి చెంద లేని వారుంటారు. అన్నిటినీ అమర్చుకోవటం ఒకవంతు. అమ ర్చుకున్న వాటిని వినియోగించుకోగలగడం ఒకవంతు అమ ర్చుకోవడానికి కృషి చెయ్యాలి. వినియోగించుకోడానికి వివే కం ఉండాలి. పెద్దల సాహచర్యంలో వివేకవంతమైన కృషి చేసిన వాని జన్మ ధన్యం. వివేకవంతమైన కృషిలో నేర్పరిగా మనని తీర్చిదిద్దేవాడే మనకు గురువు. మననుండి దండుకునే వాడు మనకు గురువుకాడు. మనకు తెలియకుండానే మనను దిద్దుకునే వాడు మనకు గురువు. అతడు "మనీ" ని కోరడు. "మననే" కోరతాడు. ఎందుకో తెలుసా? ప్రేమతో స్వీకరించి, దీక్షతో తీర్చిదిద్దడానికి.

ఆశీస్సులతో

..........

# ప్రేమే బోధగా

విశాఖపట్టణం,
18-4-1982

చిరంజీవి.........కు

ఆశీస్సులు నీవు పారవశ్యముతో వ్రాసిన లేఖ అందు కొన్నాను. మీఊరిలో నీవు నిర్వహించుచున్న కార్యక్రమము మరింత విస్తృతి చెందగలదు.ఎక్కడ సమర్పణ ఉండునో అక్కడ వికాసము విస్తృతి ఉండగలవు. నీ ఆరోగ్యము కుదుటపడినీవు నీ ఊరికి నీ బృందమునకు మన సమాజమునకు తగిన వ్యక్తిగా రూపొందవలసియున్నది.

ఆశయములు ఆచరణలుగా రూపొందవలెనన్నచో ఆవే శము ఉత్సాహముగా రూపొందవలసి యున్నది. ఆవేశము ఉద్వేగమును కలిగించగాఉత్సాహముకర్తవ్యముయెడలఉన్ముఖ త్వమును కలిగించగలదు. దేశాభ్యుదయమును కోరుతున్నయువ తరం ఉద్వేగము నుండి, ఉన్ముఖత్వమునకు తమను తాముమల చుకోవలసి యున్నది.

ప్రేయసులో మీరు పొందుచున్న అనుభూతి ఇంకను ద్విగుణీకృతము కాగలదు. నా నుండి నీవుపొందుచుండిన మా తృవాత్సల్యము, పితృ వధనిర్దేశము చిరకాలము కొనసాగి నీ ఎదుగుదలకు సహకరించ గలవు చెట్టుకు నీరు పోసి పెంచు చున్నట్లు మిమ్ములను నాప్రేమతో పెంచుకొనుచున్నాను. ప్రేమ అనునది కూడ జలమే. అది జీవజలము, దివ్యజలము

మనిషి ఎదుగుదలకు దోహదము చేయకలిగినది అదే. హృదయ భాండము నుండి ఆ ప్రేమ జలమును తోటిజీవులకు పంచిపెట్టు జన్మ ధన్యము. అట్టి పంచి పెటగల అవకాశమే దుర్లభమైత ఈ మానవ జన్మము ఒకసారి ఈ ప్రేమను రుచి చూసినవాన తన తోటివారిని ప్రేమించ కుండ ఉండలేడు నానుండి ప్రేమను పొందుతున్న నీవు మీ ప్రాంతం సోదరబృందానికి ఆ ప్రేమను వెదజల్లుతున్నావుగదా।

బోధించుట కన్న ప్రేమించుటయే మిన్న నిజమునకు పెద్దల బోధ వారి ప్రేమ యొక్క రూపాంతరమే. హృదయ మందలి ప్రేమను వాక్కులుగా రూపొందించి వారు తోటివారిని స్పృశిస్తూ ఉంటారు. సూర్యుని వెలుగు కిరణాలుగా రూపొందినట్లు వీరి ప్రేమ వాక్కులుగా రూపొందుతుంది. అలాంటి వాక్కులే చిరకాలం నిలిచిపోయే ఋక్కులు. వేదాలూ ఉపనిషత్తులూ, పురాణాలూ, ఇతిహాసాలూ అలా దిగి వచ్చినవే. నిజానికి పెద్దలు బోధించరు. మనకు బోధపరుస్తారు. తమకు తెలిసింది ఏ కరువు పెట్టేవారు పండితులు. మనకు వల సింది అనుగ్రహించి మన కరువు తీర్చేవారు మహాత్ములు. వారి ప్రేమే మనకు కావలసిన బోధగా మన కందుతూ ఉంటుంది.

నీ ఆరోగ్యం మరింత కుదుట పడేందుకుగాను నీకు ఒక డోసు మందు పంపుతున్నాను. తాతగార్లందరిని మన యువక బృందాన్ని గ్రామ ప్రజలందరినీ అడిగినట్లు చెప్పు.

ఆశీస్సులతో

..........

# మనిషిని మేలుకొలపడం ఎలా?

విశాఖపట్టణం
14-4-85

చిరంజీవి ...... కు ఆశీస్సులు. నీవు దేశపరిస్థితుల యెడల ఆర్తిచెంది వ్రాసిన లేఖ అందుకున్నాను. ఈ నాటి ఈ పరిస్థితులను తీర్చిదిద్దుకోవడంలో మనలో ప్రతి ఒక్కరం మన వంతు పాత్రను శ్రద్ధతో నిర్వహించవలసి ఉంది. దీపావళినాడు ఒక్కొక్క ప్రమిద వెలిగించుకుంటూ వెళ్ళితే దీపాల వరుసలు వెలుగులతో విజృంభించినట్లు, మనలో ఒక్కొక్కరం మేలు కుంటూ ముందుకు సాగితే, జాతి పునర్నిర్మాణం దానంతటదే సిద్ధిస్తుంది. "సమాజాన్ని సంస్కరించాలి" అన్న తాపత్ర యంలో పడిపోకుండా మనని మనం సంస్కరించుకోవడం మొదలు పెట్టాలి. ముందు మన ఆశయాలకు మనం కట్టు బడాలి. ఆ పైన ఆ ఆశయాలకు ఆచరణీయమైన రూపకల్పన చేసేటందుకు క్రమశిక్షణతో మనం కృషిచెయ్యాలి. ఇలామనని మనం సంస్కరించుకుంటూ ముందుకు సాగుతుంటే మన చుట్టూ ఉన్న వ్యక్తుల్లో మన సంస్కారానికి దగ్గరి వారందరూ మనని చూచి మనకు దగ్గరై వాళ్ళుకూడా మనలాగా తమని తాము సంస్కరించు కోవడం మొదలుపెడతారు. ఈ ఒక్క పద్ధతిలో మాత్రమే సమాజాన్ని సంస్కరించడం సాధ్యం, కేవల ఆవేశపరులు రెచ్చగొట్టగలరు గాని సంస్కరించలేరు. గాంధీమహాత్ముడు మొదలైనవారు తమని తాము సంస్కరించు కునే ప్రయత్నంలోనే జాతి మొత్తాన్ని చైతన్యవంతం

చేయగలిగారు. ఆయనను చూసి ఆయనలా ఉండాలని ప్రయ త్నించడంతో ఆ రోజుల్లో మనదేశంలో ఊరికొక నాయకుడు, వాడకొక నాయకుడు రూపొంది జాతిని నడిపించ గలిగారు. ఆయనను చూసిన విద్యార్థులు కిటికీలను దూకుకుంటూ, ద్వార బంధాలను దాటుకుంటూ ఆయన వెంటపడి వచ్చేసారు. ఆయ నను చూసి హోదాలలో ఉన్నవారెందరో తమ హోదాలను, ఆదాయాలను తృణప్రాయంగా తలచి, వాటిని విడిచి, ఆయన వెంట నడిచారు. తనను తాను సంస్కరించుకునే ప్రయత్నంతో మహోత్ముడు జాతి నంత జాగృతం చేయగలిగాడు. ఈ శతా బ్దంలో జాతి పునర్నిర్మాణం కోసం దీక్షవహించి నిలచిన మాస్టర్ ఇ. కె. మళ్ళీ అదే మార్గంలో యువకులను స్వీకరించి నడపగలిగారు. మళ్ళీ మనం కూడా అదే చేయాలి. మనం చెయ్యవలసిందల్లా ఒక్కటే. మన ఆశయాలకు తగ్గట్టుగా మన వ్యక్తిత్వాన్ని రూపొందించు కొనేటందుకు దీక్ష వహించడం. ఆదీక్ష ఫలించినపుడు కొన్నివేల మందిని ఆ కర్షించి, జాతి శ్రేయస్సుకై నడిపించగలము. జాతిని కదలడం లేదు. మారడంలేదు అని మనం నిందించ కూడదు. మన ప్రవర్తనతో జాతిని మేలు కొలపడం మనకు చేత కావాలి. మన జీవితమే మన తపస్సుగా పరిణమించినపుడే అదిసాధ్యం.

తోటివారిని రెచ్చగొట్టేవారు కాదు. మేలు కొలిపే వారు కావాలి. జాతి మేలు కోరినవారు చేయవలసిందదే. జాతిని మేలు కొలుపగల స్థితిలో తమని తాము నిలబెట్టుకోవ డం.

సూర్యుడు ఉదయించి లోకాలను వెలిగించి, జీవులను మేలు కొలుపుతున్నాడు. మేలు కొలపడానికి అతడు తన కిర ణంతో స్పృశిస్తున్నాడు తప్ప, ప్రతివ్యక్తి మీద విరుచుకు పడుతున్నాడా? అలాగే మనం మన సత్ప్రవర్తనతో తోటి వారి హృదయాలను స్పృశించి మేల్కొల్పగలగాలి. తోటివారు అలా మేల్కొనాలి అంటే మనకి కొన్ని సత్యాలు అనుభవంలోకి రావాలి. అందరి రూపంలోనూ ఉన్నది ఒకే చైతన్యం. ముందు ఈసమభావం మనకి అలవడాలి మనంఎలాగైతేనిద్రిస్తూనిద్రిస్తూ కొంత కాలానికి మేలుకొన్నామో, అలాగేపక్కవాడు కూడా ప్రస్తుతానికి నిద్రిస్తున్నాడనీ, సమయం వచ్చినపుడు మేల్కొని మనలాగా, ఇంకా చెప్పాలంటే మనకంటె ఎక్కువగా కూడా విజృంభించగలడనీ హృదయపూర్వకంగా మనం విశ్వసించాలి ఇంకా కొంచెం పైకి వెడితే మన పక్కవారి రూపంలో ఉన్నది కూడ మనమేనని అనుభవానికి వస్తుంది. ఈ అనుభూతి మనం పొందినపుడు మాత్రమే మన పక్కవాని హృదయాన్ని మీట గలిగే అవకాశం ప్రకృతి మనకు అనుగ్రహిసుంది ఈ సమష్టిలో నిలిచిన వాళ్ళ ప్రవర్తన మాత్రమే జాతిని జాగృతం చేయగల్గుతుంది. మన ప్రవర్తన అలా తోటివారిని జాగృతం చేస్తున్నపుడు మనకేమనిపిస్తుందో తెలుసునా? ఇన్ని శరీరాలలో నుండి వరుసగా మనమే, మేల్కొని కనులు నలుపుకొని కర్తవ్యం వైపుకు చూస్తున్నట్లు అనిపిస్తుంది. అనిపించడం అంటేఅనుభవం కలగడమే. ఈ అనుభవాన్నే పెద్దలు ఆత్మదర్శనం అన్నారు.

ఈ విధంగా శరీరంనుండి శరీరానికి స్పర్శగా ప్రసరిస్తూతా నుగా మేల్కొంటూ కర్తవ్యోన్ముఖమై ముందుకుసాగడాన్ని అంతర్యామిత్వం చెందడం అంటారు. ఈ విధమైన స్థితిలో నిల బడి, జాతి శ్రేయస్సు కొఱకు ఎవరు సంకల్పం చేసినా ఆసం కల్పం సత్ఫలితాలను సాధిస్తుంది. ఆ ప్రణాళిక చిరకాలం వర్ధి ల్లితరతరాల మానవులకు నడువవలసిన దారిని చూపిస్తుంది. ఒక రాముడు, ఒక కృష్ణుడు అలాంటి సంకల్పంతోలోకహితాన్ని కోరి నిలచి తమ జీవితాలనే మానవ జాతికి మార్గంగా తీర్చిదిద్ది అందించారు. కనుకనే యుగాలు నడిచినా వారి జీవితాలుమన కళ్ళముందు స్పష్టాతిస్పష్టంగాగోచరిస్తూనే ఉన్నాయి.జాతిలో జరగవలసిన ధర్మ సంస్థాపన కొఱకు ఆనాడు వారెలాచేశారో ఈనాడు మనమూ అలా చేయ వలసి ఉంది.

ఇంతకూ తేలినదేమంటే జాతి శ్రేయస్సు కోరి సేవకు లుగా రూపొందగోరినవారు ముందు తమమాటతాము వినాలి. అంటే మనం అనుకున్నట్లు మనం ఉండగలగాలి. ఈ మా ర్గాన నడిచేటందుకు మనం పెట్టవలసిన పెట్టుబడి మనజీవితమే. మన జీవితాన్ని పెట్టుబడిగా పెట్టి పెద్దల అడుగుజాడలకుకట్టు బడి నడవగలిగిననాడు జాతి పునర్నిర్మాణంలో మనవంతుపా త్రను మనకు తృప్తికలిగేలా మనం పోషించగలం.

ఇక,నీవువ్రాసిన ప్రస్తుత పరిస్థితులకుతగినపరిష్కారాలు నేను, మాస్టరుగారు వ్రాస్తూ వచ్చిన గ్రంథాలలో చాలా వరకు దొరుకుతాయి. ఇంకాపెద్దలువ్రాసినగ్రంథాలున్నాయి. వీటని చదివేక, వీటిని సమీపిద్దువుగాని నేనూ నీలాంటి అన్వే

పినే. ఆ అన్వేషణే "అన్వేషణ-అనుభూతి"తో మొదలు పెట్టి వరుసగా అతురాల్లో అనుభూతులు సంభాషణలు-సమన్వయాలు, సందేహాలు-సమాధానాలు, మానవసేవలో మాస్టర్ ఇ. కె. దర్శనాలు-నిదర్శనాలు, మాటలు-మంత్రాలు మొదలైన గ్రంథాలుగా రూపొందింది. ఇది చదవడం ప్రారంభిస్తే నా ప్రయాణమే నీ ప్రయాణమై నాకు అందిన సమన్వయం నీకూ అందుతుంది. ఈ గ్రంథాలన్నీ మీ మిత్రుడు నీకు సమకూర్చగలడు. ఈ మార్గంలో తానూ పయనిస్తున్నవాడుగనుక, తన అనుభవాలను నీకు తగిన మార్గంలో అందించి ప్రోత్సహించగలడు. అతడు, నీవు, నీ మిత్ర బృందం జాతిపునర్నిర్మాణమునకు నడుము కట్టి జీవితములను సార్థకములు చేసికొందురు గాక! నేనున్నది మీకొఱకు, మీలో నన్ను చూసుకొనేటందుకొఱకు.

ఆశీస్సులతో

.............

# నమ్మినవాడు చెడడు - నమ్మనివాడు పొందడు

విశాఖపట్టణం
12. 5. 84

ప్రియసోదరులు.........గారికి

ప్రేమతో కృష్ణస్వామి వ్రాయునది.

మీ పరిస్థితులు ఎప్పటి కప్పుడు గమనిస్తూనే ఉన్నాను. జరగవలసినది చూడటమే తప్ప, జరిగిన దాన్ని గురించి చర్చించవలసిన పనిలేదు. రామకృష్ణ పరమహంసను కూడా మొదట్లో అందరూ పిచ్చివాడనే అనుకున్నారు."సంశయాత్మావినశ్యతి" అన్నాడు గీతలో కృష్ణుడు. మనకు కలుగు తున్న అనుభూతులను గూర్చి సంశయం కలగడం మంచిదికాదు. చేయవలసినది ముందుకు సాగడమే. తర్కించుట తగనిపని. ఆలోచించుట ఆచరణ శూన్యతకు నిదర్శనం. కర్తవ్య నిర్వహణమే చెయ్యవలసిన సాధన. ఇతరుల అభిప్రాయములను పట్టించుకొనుట ఒక బలహీనత. అట్లని వారిని త్రోసి రాజనుట ఒక అహంకారము మృదువుగా పనిచేసుకొనుచూ పోవుట శ్రేయోదాయకము.

దేనినైనా కావలెనను కొనుట కోరిక అది జరగకుండునట్లు ఆ కోరికయే అడ్డుపడి ఏడిపించును, మానవ జీవితంలో కావలెనను కొన్నది దూరమౌతూ వద్దనుకున్నది చేరువౌతూఉంటుంది. అయితే చేయవలసింది ఏమిటి? దేనినీ కావాలనిగానీ, వద్దని

కానీ అనుకొనకుండుట కోరికలు, కాపత్రయములు ఉన్నవారికి గురువు కూడ చేయగలిగింది లేదు. తనకు సంబంధించిన మంచి చెడ్డలన్నియు గురువునకు సమర్పణము చేసినవాడే అనుగ్రహ మును పొందగలడు. గురువు ఉన్నది మన కోరికలు తీర్చుటకు కాదు. మన కర్తవ్యమును నిర్దేశించుటకు, కనుకనే గురువు నడుగుటమాని, అతడు చెప్పినట్లు నడచుకొన్నవాడు శిష్యుడు మిగిలినవారు శిష్యులనబడువారు. మనకు ఏది మంచిదో, ఏది ఎప్పుడు అవసరమో గురువునకు తెలియునని. గుర్తుండుటయే శిష్యుడనబడుటకు అర్హత.

నమ్మినవాడు చెడడు. నమ్మనివాడు పొందడు. ఎవరి విశ్వాసము వారికిరక్ష. సంశయించు తత్త్వమే మనిషికి మనస్సు విధించుశిక్ష. "మనసును ఉంచుకొని శిక్షను అనుభవిస్తావో, మన సును సమర్పించుకొని రక్షణ పొందుతావో నీవే తేల్చుకో. నీవు తేల్చుకొనే వరకు వేచి ఉంటాను" అంటాడు దైవం.

దేవుడు చిత్రమైన వాడు. అడిగినవారికి సహకరిస్తాడు. అడగని వారిని స్వయంగా చూచుకొంటాడు.

ప్రేమతో

... ... ......

# నీ జీవితమే ఒకతపస్సు

విశాఖపట్టణం
13-5-85

చి॥సౌ॥......కు ఆశీస్సులు. నీవు హృదయాన్ని విప్పి పలు చిన నీలేఖ అందుకున్నాను. మూగగా అనుభవిస్తున్న ఇన్నేళ్ళ వేదన తడబాటు పడుతూ అక్షరరూపాన్ని ధరించినట్లుగోచ రించింది. అయితే నీ జీవితం క్రమంగా మలుపులు తిరుగుతూ వస్తున్నది. ఆయన వ్యసనాలకు దూరంగా ఉండాలని నిర్ణ యించుకోవడం తొలిమలుపు. మాస్టరుగారు పరిచయమై తన స్పర్శను అందించడం మలిమలుపు. మీ ఊరిలో మనం కలుసు కోవడం మూడవ మలుపు. ఇందులో ఒక మలుపునుండి మరొక మలుపుకు తిరుగుతున్న కొద్దీ నీకు కొంచెం ఊపిరి అందడం జరుగుతూ వచ్చింది. దాని ప్రకారం మనకలయిక నీకు మరింత ఊపిరి అందేలా చేయగలదని అనిపిస్తున్నది. నీ విషయంలో జీవితమే ఒక తపస్సుగా పరిణమించింది. ఆ తపస్సు ఎంత తీక్ష ణంగా సాగిందో నీ ఉత్తరంలో కొంతవరకు గ్రహించగలిగేను ఏ గృహంలో స్త్రీ గౌరవించబడుతుందో ఆ గృహంలో ఏ లోటూ లేకుండా సిరిసంపదలు వర్ధిల్లుతాయి. ఏ గృహంలో స్త్రీ ఒక దేవతా మూర్తిగా ఆరాధించబడు తుందో ఆ గృహంలో దివ్యత్వం వెల్లివిరుస్తూ ఉంటుంది. ఎక్కడా దొరకని తృప్తి ఏదో అక్కడ దొరుకుతుంది. ఏ గృహంలో స్త్రీ చిన్నచూపు చూడబడుతుందో, చులకన చేయ బడుతుందో ఆ గృహం అశాంతికి, అసంతృప్తికి నిలయమౌ

తుంది. పెద్దలు, పురుషులు స్త్రీని చక్కగా బాధ్యతతో రక్షించుకోవలసి ఉందని చెప్పారుకాని చిన్నచూపు చూడమని చెప్పలేదు. తోటమాలి పువ్వుతో ఎలా ప్రవర్తిస్తున్నాడు? పురుషుడు స్త్రీతో అలా ప్రవర్తించగలగాలి. దీపారాధనను కనిపెట్టుకుని చూసుకోవడం ఎలాంటిదో పురుషుడు స్త్రీతో ప్రవర్తించవలసిన తీరు అటువంటిది. రక్షణ అవసరం అంటే పెత్తనం చేయమని అర్థంకాదు. ఆమెను రక్షించుకోవడం ద్వారా పురుషుడు తన జీవితాన్ని అర్థవంతం చేసుకోవాలని అర్థం. స్త్రీ నుండి పురుషుడు గ్రహించవలసింది పోషణ. పురుషుని నుండి స్త్రీకి లభించవలసింది రక్షణ. పురుషుడు లేని స్త్రీ జీవితానికి రక్షణ కరువౌతుంది. స్త్రీ లేని పురుషుని జీవితానికి పోషణ లోపిస్తుంది. స్త్రీ సాకకపోతే పురుషుడు లేడు. పురుషుడు రక్షించుకోకపోతే స్త్రీ లేదు. ఇదీ సృష్టిలోని స్త్రీ పురుష బాంధవ్యంలోని సమన్వయం. దీనిని గమనించి ఎవరికి వారుగా హక్కులను కోరుకునే బదులు, ఒకరికి ఒకరై బాధ్యతపడి జీవించడంలో తృప్తిని అనుభవించండి. అంటూ మన పెద్దలు మానవ జీవనానికి మార్గాన్ని నిర్దేశించారు. ఈ సత్యాన్ని వంట పట్టించుకున్న కొద్దీ దాంపత్యజీవితానికి శోభ పెరుగుతుంది. ఈ సత్యాన్ని వంట పట్టించుకోవడానికి సిద్ధపడకపోవడంతో ఇటీవల కాలంలో దాంపత్య జీవితాలలో అపశ్రుతులు వినబడుతున్నాయి. మగవాడు మగవాడుగా గాక, స్త్రీకి పగవాడుగా కూడా తయారౌతున్నాడు. ఆరాధించవలసిన స్త్రీని అణగద్రొక్కే ప్రయత్నం చేస్తున్నాడు. దీనివల అతడు బావుకున్నదాని కన్నా, కోల్పోతున్నదే ఎక్కువ. మంత్రిగా

కూడా చూడవలసిన భార్యను కేవలం దాసిగా చూస్తున్నారు. ఆమె అనుభవాన్ని, సామర్థ్యాన్ని వినియోగించుకో లేకపోతున్నాడు. దానితో అతని జీవితానికి చుక్కాని కరువౌతోంది. పెత్తనం చేస్తున్నానన్న డాబుతప్ప అతడు పొందుతున్న తృప్తి లేదు. ఈ తృప్తి లేక పోవడం అసహనంగా రూపొంది అతడు మరింత చిరుచుకు పడుతున్నాడు ఈ స్థితిలో పడి కొట్టుకుపోతున్న మగవారిని స్త్రీలు తమ జీవితాన్నే తపస్సుగా భారపోసి రక్షించవలసి ఉంది. నీ కుటుంబంలో నీవు చేసిందదే, నీ భర్తను ఇన్ని మలుపులు తిప్పుకుంటూ ఈ స్థితికి తీసుకు వచ్చింది నీ సహనమే. నీ తపస్సే. మాస్టరుగారు పరిచయమైనా, నేను పరిచయమైనా అవన్నీ నీ తపస్సుసాధించిన ఫలితాలే. ఇంకకొద్ది సంవత్సరాల్లో నీ తపస్సు మరింత ఫలించి, నీ భర్త నిన్ను ఇలవేల్పుగా ఆరాధించుకునే రోజులు వస్తాయి. ఇక నీ బిడ్డలంటావా? వాళ్ళునాతో నా వాళ్ళై వర్ధిల్లుతారు. వాళ్ళను గూర్చి నీకు బెంగవద్దు. తరచు ఉత్తరాలు వ్రాస్తూండు.

భారతస్త్రీకి సహజంగా ఉన్న ఓర్పుకు సమాజాన్ని సరిదిద్దగల నేర్పుతోడై ఈ జాతిని రక్షించుగాక!



ఆశీస్సులతో

................

# డా॥ వేమూరి కృష్ణస్వామిగారి
# ఇతర రచనలు



ప్రతులకు :

మానవ ధర్మ శిక్షణా సంస్థ
L.I.G. 11 లాసన్స్‌బేకాలనీ, విశాఖపట్టణం